














Heroes start early.

Ride, race, take a tumble or even take a fall.
Because it's never too early to be a hero.





## ఈ సంచికలో ...




**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**

***Remittances in favour of Chandmama India Ltd.***
**to**

Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ,
మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్'
పేరిట పంపండి.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# సుస్థిర శాంతి రహస్యం

మనుషులు ఎల్లప్పుడూ శాంతినే కోరుకుంటారు. సుస్థిర శాంతి మానవజాతి స్వప్నం గానే ఉంటున్నది. ఈ లక్ష్యసాధనకు ఆయాకాలాలలో నాయకులు ఇతోధిక ప్రయత్నం చేస్తూనే ఉన్నారు.

యాభైసంవత్సరాల క్రితం ఆసియాలోని రెండు అతిపెద్దదేశాలయిన చైనా, భారత్‌లు మంచి ఇరుగుపొరుగు దేశాలుగా మనుగడ సాగించాలని నిర్ణయించాయి. భారత ప్రధాని జవహర్‌లాల్‌నెహ్రూ ఆహ్వానం మీద చైనా ప్రధాని చౌ-ఎన్-లై 1954 లో భారతదేశానికి విచ్చేశారు. లక్షలాది ప్రజలు మిన్నుముట్టే "హిందీ-చీనీ భాయి భాయి" నినాదంతో ఆయనకు స్వాగతం పలికారు. శాంతియుత సహజీవనానికి దోహదం చేసే 'పంచశీల' సూత్రాలపై భారత్-చీనా దేశాలు సంతకాలు చేశాయి. ఉభయదేశాలు ఎప్పుడుగాని శత్రువులు కాకూడదన్నది పంచశీల సిద్ధాంతాలలోని కీలక అంశం. మూడు నెలల తరవాత నెహ్రూ చైనా పర్యటనకు వెళ్ళినప్పుడు ఆయనకు ఘనస్వాగతం లభించింది.

చీనా-భారత్ మైత్రీ సంబంధాలు ఈనాటివి కావు. వాటికి రెండువేల సంవత్సరాల చరిత్ర ఉంది. క్రీ.శ. 1 వ శతాబ్దంలో కశ్యపమతంగుడు, ధర్మరక్షకుడు అనే ఇద్దరు బౌద్ధ మతాచార్యులు చైనాను సందర్శించారు. ఆ తరవాత పలువురు చీనా యాత్రికులు మన దేశంలో పర్యటించారు. ఇక్కడి విశేషాలను తమ రచనలలో నిక్షిప్తం చేశారు.

ఇక ఇటీవలి కాలానికి వస్తే, ఏం జరిగిందో, ఎక్కడ పొరబాటు జరిగిందో చెప్పలేంగాని 1962 వ సంవత్సరంలో చైనా హఠాత్తుగా భారత భూభాగంపై దాడి ప్రారంభించింది. ఆ తరవాత కొద్దిరోజులకే కాల్పుల విరమణ ప్రకటించింది!

ఇప్పుడు చీనా, భారత్‌లు మళ్ళీ దగ్గరవుతున్నాయి. మనప్రధాని అటల్ బిహారీ వాజ్‌పాయ్ ఇటీవలి చైనా పర్యటన భవిష్యత్తుపట్ల ఎన్నో ఆశలను చిగురింపజేసింది. ఆ ఆశలన్నీ ఫలించాలని మనసారా కాంక్షిస్తున్నాం.

Visit us at : http://www.chandamama.org

సంపాదకుడు : విశ్వం



హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా – 23

మన జాతీయోద్యమ నాయకులు కొందరిని గురించి ఇక్కడ ప్రస్తావించాము. వారెవరో మీకు తెలుసా?

అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!*



1. 1920–1947 మధ్యకాలంలో నేను దాదాపు 10 సంవత్సరాలు జైలులో గడిపాను. నేను భారతదేశ తొలి ప్రధానమంత్రిని. నా పేరేమిటి?

----------------------------------------------

2. 'అభినవ్ భారత్' అనే అంతర్జాతీయ విప్లవసంస్థను స్థాపించాను. స్వాతంత్ర్య సమరయోధుడినైన నేను మరాఠీ భాషలో భారత స్వాతంత్ర్య ప్రథమ సంగ్రామ చరిత్రను రచించాను. మీకు నాపేరేమిటో తెలుసా?

----------------------------------------------

3. నన్ను భారతదేశ 'ఉక్కుమనిషి' గా చెబుతారు. నేనెవరిని?

----------------------------------------------

4. 1912 లో జరిగిన లార్డ్ హార్డింజ్ ఊరేగింపు మీద బాంబు వేయడానికి నేనే కారణం అంటారు. 'ఇండియన్ నేషనల్ ఆర్మీ'తో నాకు సన్నిహిత సంబంధం ఉన్నది. నేను మీకు తెలుసా?

----------------------------------------------

5. 1930 లో బీహార్‌లో ఉప్పు సత్యాగ్రహం జరిపాను. భారత రిపబ్లిక్ తొలిరాష్ట్రపతిని. నా పేరేమిటి?

----------------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన రచయిత/కవి ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

**నా అభిమాన జాతీయ నాయకుడు:**

..............................................................................

..............................................................................

పాల్గొనేవారి పేరు: ..............................................................

వయసు:...............తరగతి: ....................................................

చిరునామా:..........................................................................

..............................................................................

పిన్: ..........................  ఫోన్: ..........................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం:......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2003 సెప్టెంబర్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్–23
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ
ఈకాట్టుతాంగల్, చెన్నయ్–600 097.

సూచనలు:

1. 8–14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు



# ప్రజానాయకుడి శతజయంతి ఉత్సవాలు

మనదేశం ఇప్పుడు శతజయంతి ఉత్సవాలు జరుపుకుంటూన్న 'లోక్‌నాయక్' జయప్రకాష్ నారాయణ్ బీహార్‌లోని సితాబ్దియారా గ్రామంలో 1902 అక్టోబర్ 11వ తేదీ జన్మించాడు.

జయప్రకాష్ చిన్నప్పుడు జంతువులన్నా, పక్షులన్నా ఎంతో మక్కువ కనబరిచేవాడు. పాట్నాలో ఆయన విద్యాభ్యాసం ఆరంభమయింది. పాఠశాలలో చదువుకుంటున్నప్పుడే, దేశ స్వాతంత్ర్యోద్యమం గురించి ఆయన మిత్రులతో చర్చించేవాడు. కళాశాల రోజుల్లో గంగానదీ తీరంలో జరిగే రహస్యసమావేశాలకు హాజరయ్యేవాడు.

ఉన్నతవిద్యనభ్యసించడానికి ఆయన అమెరికా వెళ్ళాలనుకున్నాడు. అలా వెళ్ళడానికి ముందు మన దేశంలోని హోటళ్ళలో, తోటలలో, పరిశ్రమలలో పనిచేసే అవకాశం ఆయనకు కలిగింది. అప్పుడాయన శ్రమ విలువను గుర్తించడమే గాక, శ్రమజీవులు పడుతూన్న కష్టాలనూ ప్రత్యక్షంగా చూడగలిగాడు.



అమెరికా కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో ఆయన కెమికల్ ఇంజనీరింగ్, హయ్యర్ కాలిక్యులస్ అభ్యసించినప్పటికీ, క్రమంగా సామాజికశాస్త్రం పట్ల ఆకర్షితుడయ్యాడు. 'ఫాదర్ ఆఫ్ సోషియాలజీ'గా ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ప్రొఫెసర్ ఎడ్వర్డ్ రాస్‌దగ్గర సోషియాలజీ చదివి, సమాజానికి సేవచేయాలన్న ఉన్నత లక్ష్యంతో, తపనతో 1929 లో భారత్‌కు తిరిగి వచ్చాడు.

1930 లో నెహ్రూ అధ్యక్షతలో జరిగిన లాహోర్ కాంగ్రెస్ మహాసభలకు హాజరై కాంగ్రెస్‌లో చేరాడు. అదే సంవత్సరం గాంధీజీ పిలుపునందుకుని సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళాడు.

రాంమనోహర్ లోహియా, అశోక్ మెహతాలతో కలిసి 1934 లో కాంగ్రెస్‌లోనే సోషలిస్టు గ్రూపును ఏర్పాటు చేశాడు. తన ఉపన్యాసాలద్వారా, రచనలద్వారా దేశంలో సోషలిస్టు భావాల వ్యాప్తికి కృషిచేశాడు. దేశసంపదలను ప్రజలందరూ సమంగా పంచుకునే తరతమ భేదాలు లేని సమసమాజ నిర్మాణం కోసం పిలుపునిచ్చాడు. క్రమంగా ఆయనజాతీయనాయకుడిగాపరిణమించాడు.

స్వాతంత్ర్యానంతరం 1952 లో జరిగినఎన్నికలలో సోషలిస్ట్‌పార్టీ నిలబడలేకపోయింది.అయినా, తన మంత్రిమండలిలో స్థానం కల్పిస్తానని నెహ్రూ, జయప్రకాష్‌ను ఆహ్వానించాడు. కాని ఆయన అంగీకరించలేదు. జయప్రకాష్ ఆ తరవాత వినోబా భావే సర్వోదయ ఉద్యమంపట్ల ఆకర్షితుడయ్యాడు. స్వాతంత్ర్యం, సమభావం ప్రాతిపదికలో ప్రతి ఒక్కరి సంక్షేమం లక్ష్యంగా పాటుపడే సర్వోదయ ఉద్యమానికి తన ఆస్తిపాస్తులను ఇచ్చాడు.

1971 ఇండో-పాక్ యుద్ధానంతరం దేశంలో ఆర్థిక సంక్షోభం ఏర్పడింది. ఆర్థికమాంద్యత, నిరుద్యోగం, అవినీతి ఘోరతాండవంచేశాయి. అప్పుడు జయప్రకాష్‌నారాయణ్ పరిపూర్ణస్వాతంత్ర్యంకోసం పిలుపునిచ్చాడు. సామాజికంగాసమూలమైనమార్పు, ప్రజాస్వామ్య పునరుద్ధరణ, ప్రజాప్రభుత్వం ఏర్పాటు లక్ష్యంగా ఉద్యమం చేపట్టాడు.

దేశవ్యాప్తంగా చెలరేగిన వ్యతిరేకతను అణచడానికి అత్యవసర పరిస్థితి ప్రకటించబడింది. ముఖ్యమైన నాయకులు జైళ్ళపాలయ్యారు. అనారోగ్యంతో బాధపడుతున్నప్పటికీ జయప్రకాష్‌ను కూడా జైల్లో పెట్టారు. ఇరవై నెలల తరవాత అత్యవసరపరిస్థితి రద్దయింది. ఎన్నికలు జరిగాయి. ఎన్నికల ప్రచారంలో జయప్రకాష్ నారాయణ్ కీలకపాత్ర వహించాడు. కేంద్రంలో మొట్టమొదటి కాంగ్రెసేతర ప్రభుత్వం ఏర్పడింది. అప్పుడూ తనకు ఏ పదవీ వద్దన్నాడు జయప్రకాష్ నారాయణ్. ప్రజాశక్తి విజయం సాధించినందుకు సంతసించాడు. ప్రజలందరూ ప్రజానాయకుడని కీర్తించినప్పటికీ, ఆయన మాత్రం చివరివరకూ తననొక ప్రజాసేవకుడిగానే భావించాడు.

1979 అక్టోబర్ 8వ తేదీ ఆయన కీర్తిశేషుడయ్యాడు.



# దానగుణం

రాజానగరంలో, రామభద్రుడనే ధనవంతుడుండేవాడు. ఆయనకు ధనంతోపాటు భగవంతుడు దానగుణం కూడా ఇచ్చాడు. ఆయనలో విపరీతమైన జాలిగుణం వుండేది. ఎదుటివాడు కష్టాల్లో వున్నాడంటే చాలు, చేతికి ఎముక లేదన్నట్టు దానం చేసేవాడు. అందుచేత క్రమక్రమంగా రామభద్రుడి ఆస్తి తరిగిపోసాగింది.

ఆయన భార్య చంద్రిక కూడా అన్నిటా భర్తకు తగినదే. ఇరుగుపొరుగులు ఆమెకు దానం విషయంలో భర్తను కాస్త కట్టడి చేయమని చెపుతూండేవారు. పిల్లలు ఎదిగి పెద్దవారయ్యేసరికి ధనం విషయంలో సమస్యలు ఎదుర్కోవలసి వస్తుందని హెచ్చరించేవారు.

కానీ, అలాంటి హెచ్చరికలు విన్నప్పుడు చంద్రిక నవ్వి, "మేఘాలు ఎలాంటి పక్షపాతం లేకుండా పంటలు పండేచోట్లనే కాక చిట్టడవుల్లో కూడా వర్షించడం సృష్టి ధర్మం. కొండలమీద, గుట్టలమీద, అడవుల్లోనూ ఎందుకు వర్షించాలనుకుంటే - జనులందరికీ ఉపయోగించే నదీనదాలు ఎలా పుడతాయి? నా భర్త దానగుణం, భగవంతుడాయనకిచ్చిన వరం. ఆ దానగుణం వల్ల, మాకు అన్యాయం జరగాలని సృష్టికర్త నిర్ణయిస్తే, అందుకు మేమేం చేయలేం గదా!" అనేది.

కాలం గడుస్తున్నది. రామభద్రుడి మగపిల్లలిద్దరూ ఆరూ, ఎనిమిదేళ్ళ వయసువాళ్ళయ్యారు. రామభద్రుడు సంస్కృత కావ్యాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసినవాడని పేరుబడ్డ వ్యక్తి.

ఒక రోజు చంద్రిక, రామభద్రుడితో, "మీరు అడిగినవాళ్ళందరికీ లేదనకుండా దానధర్మాలు చేస్తున్నారు; అందుకు నేనేనాడూ అభ్యంతరం చెప్పలేదు. ఇప్పుడు, పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. వాళ్ళకు చదువు సంధ్యలు నేర్పాలిగదా! మీరేమనుకుంటున్నారో తెలి

డా. జొన్నలగడ్డ మార్కండేయులు



యదు, నాకు మాత్రం వాళ్ళను పట్నంలో చది వించాలని వున్నది. మీరు గొప్ప సంస్కృత పండితులని తెలియనివారు లేరు. పట్నంలోని రాజావారి పాఠశాలలో ఉద్యోగంలో చేరండి. మన ధనం తరిగినా, విద్యాదానం జీవితకాల మంతా చేయొచ్చు. మన పిల్లలకు గొప్పగా ఆస్తిపాస్తులివ్వక పోయినా, బ్రతుకుతెరువుకు పనికొచ్చేలా మంచి విద్యావంతుల్ని చేద్దాం. ఏమంటారు?'' అన్నది.

రామభద్రుడు, భార్య మాటల్లోని వాస్తవాన్ని గుర్తించి, పట్టణానికి బయల్దేరాడు. మార్గ మధ్యంలో ఆయనకు బొబ్బర్లంక అనే ఊరు తగిలింది. ఆ సమయంలో, ఊరిమధ్య వున్న శివాలయంలో ధ్వజస్తంభ పునఃప్రతిష్ఠ జరుగు తున్నది. గత సంవత్సరం వచ్చిన గాలివాన తాకిడికి, ఆ ధ్వజస్తంభం పడిపోయింది. రామ భద్రుడు తన పట్నం ప్రయాణం వాయిదా వేసుకుని, శివాలయంలోకి వెళ్ళాడు. ఆయ నకు ధనవంతుడు, దానశీలి అని పేరుండడం వల్ల, అందరికీ ఆయనపట్ల గౌరవాదరాలు కలిగినై.

శివాలయానికి వంశపారంపర్య ధర్మకర్త అయిన జమీందారు కూడా అక్కడే ఉన్నాడు. రామభద్రుడు తన జమీలోని గ్రామంలోని వాడేనని తెలిసి, ఆయన ఆనందం పట్టలేక పోయాడు. ఆ తర్వాత, మాటల సందర్భంలో, సంస్కృతంలో మంచి పండితుడయిన రామ భద్రుడు, పట్నంలోని తన పాఠశాలలో ఉద్యో గంచేయడానికి ఇష్టపడడము, ఆయనకు మరింత ఆనందం కలిగించింది.

జమీందారు, రామభద్రుడితో, ''మీరు హడావిడిగా ఇప్పుడే పట్నం వెళ్ళవలసినంత అవసరమేం లేదు. మీ వీలు చూసుకుని ఉద్యోగంలో చేరండి,'' అన్నాడు.

ఆ మాటలకు రామభద్రుడు చాలా సంతో షించి, శివుడికి అభిషేకం, పూజలు చేయించి, అర్చకులకు ఘనంగా కానుకలిచ్చి, తన గ్రామానికి తిరిగి వచ్చాడు. ఆయన, భార్య చంద్రికతో జరిగిన సంగతి చెప్పాడు. తమకు భగవంతుడే సాయం చేస్తున్నాడని, ఆమె పొంగిపోయింది.

ఐతే, రామభద్రుడికి మాత్రం ఉన్న ఊరు వదిలి పట్నం పోవాలంటే బెంగ కలగసాగింది. ఎవరేదడిగినా ఇచ్చే తాను, భార్య ఉద్యోగం చేయమన్న కోరికను కాదనలేకపోతున్నాడు! అందుచేత, వ్యాకులమైన మనసుతో సాయం కాలం వేళ, దాపులనున్న ఏటిగట్టుకు బయలు దేరాడు.

ఏటిగట్టు ఒడ్డున రావిచెట్టు కింద గ్రామ దేవత ఊడలమ్మ గుడి వున్నది. ఆ గుడి ముందు పొరుగూరు నుంచి వచ్చిన యువ కుడొకడు నిలబడి, ''తల్లీ! ఇదేం అపచారం అనుకోకు. నువ్వు రాయివే అయినప్పటికీ, నీకొక పేరు తగిలించేసరికి దేవతవై కూర్చు న్నావు. చదువుకున్నాను. ఐనా, నాకేమీ విలు వలేదు. ఉద్యోగం వస్తుందని ఆశపడ్డాను. కానీ, మనుషుల బ్రతుకులు సర్వం పోటీ పందా లయిపోయినై. ఎవరో రామభద్రుడట; ఈ ఊరు నుంచి పట్నం వచ్చి, రాజావారి పాఠ శాలలో ఉపాధ్యాయుడుగా చేరతాడట. దయవుంచి, ఆయన మనసు మార్చి పట్నం రాకుండా చూడు, తల్లీ! ఆయనను కలుసు కుని, ఈ మాట చెప్పేముందు, మా ఊళ్ళో వాళ్ళందరూ నీకు మొక్కుకోమన్నారు,'' అంటూ నమస్కరించాడు.

కొంత దూరాన వుండి, ఆ యువకుడి మాటలు విన్న రామభద్రుడు, అతణ్ణి సమీ పించి వివరాలడిగాడు. ఆ యువకుడి పేరు కూర్మారావు. సంస్కృతాంధ్రాలు బాగా చది వాడు. పట్నంలో రాజావారి పాఠశాలలో ఉద్యో గానికి ఎంపిక అవవలసి వున్నది. అయితే ఈ లోగా ఆ ఉద్యోగం రామభద్రుడికే ఆయనకు ఇస్తానని జమీందారు అన్నారట! అందుచేత కూర్మారావును ఉద్యోగంలో చేర్చుకోవడం సాధ్యపడదని ప్రధానోపాధ్యాయుడు చెప్పాడు. ఐతే ఒక ఆరు నెలలపాటు రామభద్రుడు సెలవు పెట్టి ఉద్యోగంలో చేరకుండా వుంటే, కూర్మారావును తాత్కాలిక పద్ధతి మీద తీసుకుని, ఆయన తిరిగి వచ్చినాక కూడా,



ఉద్యోగంలో కొనసాగేలా జమీందారుగారి వద్ద ప్రయత్నించవచ్చని, ప్రధానోపాధ్యాయుడు సలహా ఇచ్చాడు.

కూర్మారావు చెప్పినదంతా విని రామభ ద్రుడు జాలిపడి, కూర్మారావుకు సాయం చేయాలనుకున్నాడు. ఆయన కూర్మారావును వెంటబెట్టుకుని పట్నం వెళ్ళి, ప్రధానోపా ధ్యాయుడితో, తాను ఆరు నెలల తర్వాత ఉద్యోగంలో చేరదలుచుకున్నానని చెప్పి, తనకు రానున్న ఉద్యోగంలో కూర్మారావును ప్రవేశపెట్టాడు.

తర్వాత, రామభద్రుడు ఇంటికి తిరిగి వచ్చి, భార్యకు జరిగింది చెప్పాడు. చంద్రిక మొట్టమొదటిసారిగా తన దాంపత్య జీవి తంలో భర్తను తప్పుపడుతూ, ''తనకు మాలిన ధర్మము చేటుకు దారితీస్తుంది. ఆరు నెలల కాలంలో అనుకోని ఎన్నో మార్పులు

జరగవచ్చుగదా! అన్నింటికీ భగవంతుడిదే భారం అనుకోవడం సమంజసమా?'' అని బాధపడింది.

ఊరివాళ్ళకు సంగతి తెలిసింది. ఆరు నెలలు గడిచాక రామభద్రుడు ఊరు విడిచి పట్నంలో ఉద్యోగం చేసేందుకు వెళ్ళడానికి వాళ్ళు అభ్యంతరం చెప్పారు. రామభద్రుణ్ణే ఒక పాఠశాల ప్రారంభించమని ఒత్తిడి చేశారు. రామభద్రుడు బాగా ఆలోచించి, తన పొలం లోనే ఒకవైపున పాఠశాలకోసం ఒక అంద మైన భవనం కట్టించాడు. ఇద్దరు సహాయ కులను నియమించుకుని పాఠశాల ప్రారం భించాడు.

ఒక నెల గడిచీ గడవకుండానే, రాజానగ రంలో కొత్తగా ప్రారంభమైన పాఠశాల గురించి జమీందారుకు తెలిసింది. ఆయన ఆగ్ర హించి, దివానుతో, ''ఈ రామభద్రుడు మంచి పండితుడనీ, దానగుణం కలవాడనీ విని, పట్నంలోని మన పాఠశాలలో ఉద్యోగంలో చేరమని చెప్పాను. ఆయన అలా చేరకపోగా, మనకు పోటీగా పాఠశాల నడపచూస్తున్న ట్టున్నది! వెళ్ళి సంగతి సందర్భాలు తెలుసుకు రండి,'' అని చెప్పాడు.

దివాను వెంటనే బయల్దేరి రాజానగరం వెళ్ళి, ముందుగా ఊరిపెద్దల నుంచి పాఠ శాల గురించిన వివరాలు సేకరించి, తర్వాత పాఠశాలకు వెళ్ళాడు. అక్కడ పాఠశాల భవ నానికి జమీందారుగారి పేరుండడం చూసి చాలా సంతోషించాడు. అంటే, పాఠశాల జమీందారుగారి పేరు మీదే నడుస్తున్నదన్న మాట! అందుకయ్యే ఖర్చులూ అవీ రామ భద్రుడు తన పొలాల మీద వచ్చే ఆదాయంతో భరిస్తున్నాడు.

దివాను, రామభద్రుడితో మాట్లాడి, అతడు చేస్తున్న విద్యాదానాన్ని మెచ్చుకుని, తిరిగి వచ్చి జమీందారుకు విషయం చెప్పాడు. జమీందారు పరమానందం చెంది, ''మన జమీలో రామభద్రుడి లాంటి దానగుణం కలవాడుండడం, మనందరికీ గర్వకారణం!'' అని, తన సొంతభూముల నుంచి యాభై ఎకరాల మాగాణిని, రామభద్రుడు నడుపు తున్న పాఠశాలకు దానం చేశాడు. అంతే కాకుండా, రామభద్రుడి పిల్లలిద్దరూ తమ దివాణంలోనే ఉంటూ, పట్నంలో పైచదు వులు చదివే అవకాశం కూడా జమీందారు కల్పించాడు.






# మాయాసరోవరం

## 19

[మాయాసరోవరేశ్వరుడు దొంగచాటు దెబ్బకొట్టి, జయశీలుడి మెడకు ఉచ్చుతాడు బిగించాడు. దానిని తెగనరుకుదామనుకున్న అతడితో, మాయాసరోవరేశ్వరుడు మంచిగా మాట్లాడి, కాంచన మాలతోపాటు, అతణ్ణి సరోవరంకేసి తీసుకుపోసాగాడు. ఆ సంగతి నరభక్షకులద్వారా, అడవిలో విడిదిచేసి వున్న కనకాక్షరాజుతో మాట్లాతూన్న సిద్ధసాధకుడికి తెలిసింది. తరవాత—]

నరభక్షకులు అంతా చెప్పి, వింత ఏనుగు మీదివాడు, పట్టుకుపోతున్న మనిషి రూపు రేఖలు వర్ణించగానే సిద్ధసాధకుడికి, అతడు తన మిత్రుడైన జయశీలుడని తెలిసిపోయింది. కాని, అతని వెంటవున్న యువతి ఎవరు?

నరభక్షకులు చెప్పింది విని ఆశ్చర్యపో తున్న రాజు కనకాక్షుడితో, సిద్ధసాధకుడు, ''మహారాజా, ఇక నాకు సెలవిప్పించండి. నా స్నేహితుడైన జయశీలుణ్ణి, ఆ మయాసరో వరం దుష్టులు బంధించి తీసుకుపోయారు. అంత మహాశూరుడు వాళ్ళకు ఎలా దొరికి పోయాడో నాకు అర్థం కావటంలేదు. అతణ్ణి రక్షించడం నా బాధ్యత,'' అంటూ నరవానరం భుజాల మీద ఎక్కబోయాడు.

రాజు కనకాక్షుడు అతణ్ణివారించి, ''సాధకా, ఆ జయశీలుణ్ణి రక్షించవలసిన బాధ్యత నాకూ వుంది. కొందరు భటుల్నీ, అశ్వికుల్నీ వెంటబెట్టుకుని నేనూ, నీతోపాటు వస్తాను. మనం కాలయాపనచెయ్యకుండా, ఆ మాయా సరోవరం ఎక్కడ వున్నదో తెలుసుకోవటం చాలాఅవసరం. దానిని నీ జలవృకభటుణ్ణి అడిగి తెలుసుకోరాదా?'' అన్నాడు.



సిద్ధసాధకుడు తలవూపి, శూలాన్ని జల వృకరాక్షసుడి గుండెలకేసి గురిచేసి, ''ఒరే, జలవృకభటా! నువ్వు, నాకు విశ్వాసపాత్రుడి వైనభటుడివా లేక, నీ పాతయజమాని ఆ మాయాసరోవర రాక్షసుడి పక్షాన, నా మీద వేగుకు వచ్చావా? నిజం చెప్పు,'' అన్నాడు.

ఆ ప్రశ్నకు జలవృకుడు ఏమాత్రం బెదరక, రాతిగదను సిద్ధసాధకుడి పాదాల ముందు పెట్టి, ''దొరా, నిజమైన జలవృకుడు ఆడినమాట తప్పడు. అలా తప్పినవాణ్ణి, నీటినక్క కింద వేటాడతాం. నేను తమకోసం ప్రాణాలైనా ఇవ్వటానికి సంకోచించని స్వామి భక్తిగల సేవకుణ్ణి,'' అన్నాడు.

''ఆ మాట నిజమైతే, ఇప్పుడు చెప్పు, ఆ మాయాసరోవరం ఎక్కడ వున్నది?'' అన్నాడు సిద్ధసాధకుడు.

''దొరా, లోగడ ఒకసారి తమకు మనవి చేశాను. ఆ సరోవరం ఎక్కడ వున్నదో చెపితే, నా తల పగిలి చస్తాను. అది మా జాతివాళ్ళకు, సరోవరరాజుతో పాటు, మా రాజు కూడా ఇచ్చిన శాపం,'' అన్నాడు జలవృకుడు.

ఆ మాటలకు సాధకుడు పెద్దగా నవ్వి, ''ఆ సరోవరంపక్షి వెధవకు శాపాలిచ్చే శక్తి వుంటే, వాడు హంసలరథం ఆకాశంలో తల కిందులైనప్పుడు, అక్కడి నుంచి పల్లటీలు కొడుతూ వచ్చి, నరభక్షకుల కాగే నీళ్ళబానలో పడడు, తెలిసిందా?'' అన్నాడు.

జలవృకుడు నిలువెల్లా వణికిపోతూ, ''దొరా, మీరు నా మాట నమ్మటం లేదు గనక, నాకు చావు ఎలానూ తప్పదు. అయినా, నోటితో చెప్పకుండా, సంజ్ఞలతో తెలియపరిస్తే, ఒకవేళ బతికివుంటానేమో!'' అంటూ పోయి, చెట్టు నుంచి, ఒక ఎండుపుల్లను విరిచి తెచ్చాడు.

''వృకభటా, నీ ప్రాణానికొచ్చిన భయం ఏమీ లేదు. నేను మహాకాలుడి భక్తుణ్ణి. ఒకవేళ నువ్వు చావటమే జరిగితే, నిన్ను క్షణాలమీద కైలాసానికి పంపి, అక్కడ సుఖ పడేలా చేస్తాను,'' అన్నాడు సాధకుడు.

జలవృకుడు తాను తెచ్చిన ఎండుపుల్లతో నేలమీద గీట్లు గీస్తూ, మధ్య మధ్య, ''దొరా, తలబద్దలవుతున్నది, గుండెలు చిక్కపట్టు తున్నవి,'' అంటూ అరవసాగాడు.

కనకాక్షరాజు, జలవృకుణ్ణి సమీపించి సాధకుడితో, ''సిద్ధసాధకా, నా పిల్లల్ని తగినంత మంది అంగరక్షకుల తోడు లేకుండా, అరణ్యం లోకి పోనివ్వటం, ఎంతమంది చిక్కులకు కారణమైంది! పాపం, ఈ నీటి తోడేలు వెధవ నిజంగానే తలపగిలి చస్తాడేమో,'' అన్నాడు.

''మహారాజా, వీడు ఒట్టి మూఢుడు! మహాకాలుడి దర్శనం అయి, ఆయన దీవిం చందే, ఏ నరమానవుడికీ ఇతర్లను శపించ

గలశక్తి రాదు,'' అంటూ సిద్ధసాధకుడు, జలవృకుడు మట్టిలో గీస్తున్న గీట్లకేసి పరీక్షగాచూస్తూ, ''ఒరే, భటా! ఈ నిలువు గీతలేమిటి? ఈ వంకరటింకర గీట్లేమిటి?'' అని అడిగాడు.

జలవృకరాక్షసుడు తల ఎత్తకుండానే నిలువెల్లా వడవడ వణికిపోతూ, ''దొరా, ఇవి, ఈ దాపులనున్న కొండలు, ఇవన్నీ అరణ్య వృక్షాలు. వాటిలో ఎత్తయిన ఈ వృక్షం ఒక రాతిగుట్ట మీద వున్నది. ఆ చెట్టు ఎక్కి, చిటారు కొమ్మకు పోయి ఒకసారి పడమరకు చూసి, తరవాత ఉత్తరంగా చూస్తే, మాయాసరోవరం కంటబడుతుంది!'' అని, రెండు చేతులతో గట్టిగా తలపట్టుకుని, ''దొరా, రహస్యం చెప్పేశాను. తల పేలిపోతున్నది. హా, చస్తిని!'' అంటూ దభీమని కింద పడిపోయాడు.

సిద్ధసాధకుడు చప్పున వంగి, జలవృకుడి ముక్కుదగ్గిర చేయిపెట్టి చూసి, వాడింకా గాలిపీల్చి వదులుతూండటం గమనించి, ''మహారాజా, మూఢనమ్మకాలు ముప్పు తేగలవనేందుకు, ఈ జలవృకుడే మనకు సాక్ష్యం. వాడు శాపభయంతో, గుండెలవిసి కిందపడ్డాడే తప్ప, చావలేదు,'' అని, దాపుల నున్న నరభక్షకులతో, ''ఒరే, తక్షణం పోయి నాలుగైదు కుండల నీళ్ళు తెండి,'' అన్నాడు.

నరభక్షకులు ఆశగా జలవృకరాక్షసుడి కేసి చూస్తూ కదలా మెదలక వుండిపోయారు. వాళ్ళ వాలకం గమనించిన సిద్ధసాధకుడు శూలం పైకెత్తి, ''దుర్మార్గులారా! నా ఆజ్ఞ విన్నారా? కదలరేం?'' అని కళ్ళెర్రచేశాడు.

నరభక్షకుల నాయకుడు సంజ్ఞ చేయగానే, వాళ్ళ ముసలిగణాచారి ముందుకు




వచ్చి, రాజు కనకాక్షుడికి సాష్టాంగపడి లేచి, ''మారుమూల అరణ్యాల్లో బతికే మాకు, మంచీ, మర్యాదలూ ఎలా పాటించాలో తెలీదు. మహారాజనేది మీ పేరు కాదనీ, అధికార బిరుదనీఅనుకుంటున్నాను. తమరు,ఈ దయ్యాల పోతును అవతలికినెట్టించి, ఈ నీటి రాక్షసుణ్ణి మాకు ఇప్పించండి; మీ పేరు చెప్పుకు మరీ తింటాం,'' అన్నాడు.

ముసలి గణాచారి మాట ముగించే లోపల సిద్ధసాధకుడు వాడి జుట్టు పట్టుకుని, ''ఒరే, నరభక్షక క్రూరమృగమా! నిన్నిదే, నా శూలానికిగుచ్చి మహాకాలుడికి బలి చెయ్యబోతున్నాను,'' అంటూ శూలం పైకెత్తాడు.

సిద్ధసాధకుడు, గణాచారిని శూలంతో పొడవబోయే సమయానికి, దూరం నుంచి జలాశ్వం మీద వేగంగా వస్తున్న సర్పనఖుడు అది చూసి, పెద్దగా గొంతెత్తి, ''సిద్ధసాధకా, ఆగు! తొందరపడకు! ఇప్పుడు మనం మాయా



సరోవరంలోని జలవృకరాక్షసులతో పోరాడ వలసిన పరిస్థితి వచ్చింది. అందుకు మన పక్షాన, ఈ నరభక్షకులు కూడా కలిసివస్తా రేమో ప్రయత్నించి చూడాలి,'' అంటూ కేకపెట్టాడు.

ఆ కేక వింటూనే సిద్ధసాధకుడు శూలాన్ని దించి తలతిప్పి చూశాడు. అది అదనుగా తీసుకుని నరభక్షకుల గణాచారి దూరంగా పారిపోయి, వాళ్ళ జాతివాళ్ళ గుంపులో కలిసి పోయాడు.

సర్పనఖుడు సిద్ధసాధకుడి దగ్గిరకు వచ్చి గుర్రం దిగి, నేలమీద చచ్చినట్టు పడివున్న జలవృకభటుణ్ణి చూసి, ''సాధకా, ఇతణ్ణి పరలోకానికి పంపావా ఏం! వీడు నీకు నమ్మిన బంటు గదా?'' అన్నాడు.

''వీడు నమ్మినబంటే. కాని, మీలాగే వీడికీ, వాళ్ళ రాజేకాక, సరోవరేశ్వరుడి శక్తిలో కూడా నమ్మకం వున్నట్టున్నది. ఏదో శాపం అంటూ, మాయాసరోవరానికి వెళ్ళే దారిగుర్తులు నేల మీద గీస్తూ కింద పడిపోయాడు,'' అన్నాడు సిద్ధసాధకుడు.

అంతలో కొందరు కనకాక్షరాజుగారి భటులు పాత్రల్లో నీళ్ళు తెచ్చి, జలవృకరాక్షసుడి మీద పోశారు. ఆ చల్లని నీరు పైన పడగానే వాడు నేలమీద అటూ ఇటూ పొర్లుతూ కళ్ళు తెరవ కుండానే, ''నేనెక్కడున్నాను? నరకంలోనా, సరోవరంలోనా?'' అంటూ అరవసాగాడు.

సిద్ధసాధకుడు వాడి వెన్నుమీద కాలితో గట్టిగా ఒకసారి తన్ని, ''జలవృకభటా! నీకు శాపవిముక్తి కలిగింది; బతికించాను, లే!'' అన్నాడు.

ఆ మాటలతో జలవృకుడు లేచి కూర్చు న్నాడు. సర్పనఖుడు తృప్తిగా తలాడించి, దాపులనున్న రాజభటుల్నీ, రాజు కనకాక్షుణ్ణీ చూసి, ''వైద్యదేవుడు హంసల రథంలో ఎగురుతున్నప్పుడు చెప్పగా తెలిసింది, వీరే గదా హిరణ్యపుర రాజులైన కనకాక్షులుం గారు?'' అన్నాడు.

రాజు కనకాక్షుడు ఆ క్షణం వరకూ సర్ప నఖుడి వింత వేషాన్నీ, వాడెక్కి వచ్చిన జలా శ్వాన్నీచూస్తూ ఆశ్చర్యపోతున్నాడు. ఇప్పుడా యన అతడన్నమాట అర్థంకాక, ''ఎవరా, వైద్యదేవుడు? నా రాజ్య పౌరుడేనా?'' అని అడిగాడు.

''మహారాజా, ఆ సంగతి నాకు తెలియదు. ఆయన, నా వెనకగా బయలుదేరి ఇక్కడికే వస్తున్నారు,'' అన్నాడు సర్పనఖుడు.

''సాధకా, నువ్వెరుగుదువా, ఈ వైద్య దేవుణ్ణి?'' అన్నాడు కనకాక్షుడు. సిద్ధసాధ కుడు కొంచెంసేపు చెప్పటమా, మానటమా అని తటపటాయించి, చివరకు, ''మహా

రాజా, ఆ వైద్యదేవుణ్ణి గురించి, మాయా సరోవరంలో పరమశత్రువులుగా నివసించే జలవృకరాక్షసులకూ, మాయాసరోవరేశ్వ రుడి అనుచరులకూ తెలియని చిన్న రహ స్యంఒకటి వున్నది. ఆయనా, జయశీలుడి లాగే అమరావతీ నగరవాసి!'' అన్నాడు.

''అమరావతీనగరంవాడా, జయశీలుడు! ఆ దేశపు రాజు రుద్రసేనుడు నాకు ప్రబల శత్రువు. నేను కష్టాల్లో ఉన్నానని తెలిసి, నా మీద యుద్ధప్రయత్నాలు చేస్తున్నట్టు, వేగుల ద్వారా తెలిసింది,'' అన్నాడు రాజు కనకాక్షుడు కోపంగా.

''మహారాజా, జయశీలుడి నిజాయితీని శంకించకండి. అతడు ఏ దేశపు పౌరుడైనా, తమకు మాటఇచ్చిన మేరకు, యువరాణీ, యువరాజులను వెతికి తెచ్చేందుకు సాయ పడతాడు. మీ దేశ పౌరుడుగా నేను ఇందుకు మాట ఇస్తున్నాను,'' అన్నాడు సిద్ధసాధకుడు.

సాధకుడు ఇలా మాట్లాడుతూండగా, కొంచెం దూరంలో వున్న నరభక్షకుల గుంపులో కలకలం బయలుదేరింది. దానికి కారణమే మిటా అని సిద్ధసాధకుడు అటుమైపు చూసేం తలో, వాళ్ళ నాయకుడు బెబ్బులిదొరా, గణాచారీ అతడి దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చి, ''మీలాంటి మనుషులు నలుగురు, పదీ పన్నెండుమంది జలవృకరాక్షసులతో దెబ్బలాడుతున్నారు. మమ్మల్ని సాయం పొమ్మంటారా, ఇంత ఆహారం అయినా దొరుకుతుంది?'' అన్నారు.

ఆ మరుక్షణం సర్పనఖుడు తన గుర్రం మీద ఎగిరి కూర్చుని, ''సాధకా, వాళ్ళు వైద్య దేవుడూ, నా తమ్ముడూ, హంసలరథం తోలే



రాజుగారి అంగరక్షకుడూ,'' అంటూ బయలు దేరాడు.

''జై, మహాకాళా!'' అంటూ సిద్ధసాధకుడు నరవానరం భుజాల మీదికి ఎగిరి, రాజు కనకాక్షుడితో, ''మహారాజా, ముందు ఆ నీటి రాక్షసుల్నుంచి మనవాళ్ళను కాపాడాలి,'' అంటూ సర్పనఖుణ్ణి అనుసరించాడు.

''అరణ్యదేవరా, నువ్వే, మా ఆకలి తీర్చాలి!'' అంటూ నరభక్షకులు గుంపుగా వాళ్ళ వెంట పరిగెత్తసాగారు.

సర్పనఖుడూ, సిద్ధసాధకుడూ వెళ్ళేసరికి గుర్రం మీద వుండి జలవృకులతో పోరుతున్న సర్పస్వరుడు, తన కత్తితో వాళ్ళను పొడవాలని చూస్తున్నాడు. కాని జలవృకులు ఒడుపుగా తప్పించుకుని వైద్యదేవుడని పిలవబడే దేవ శర్మనూ, హంసలరథం తోలేవాణ్ణీ, కుంటి మంగళవర్మనూ ప్రాణాలతో పట్టుకోవాలని చూస్తున్నారు. కాని, దేవశర్మ, వాళ్ళను తన

వజ్రాలు తాపిన చేతికర్రతో అటకాయిస్తూ, ''ఒరే, మూఢులారా, జాగ్రత్త! ఈ కర్ర చివర ఉన్న ముల్లు, విషపూరితం. మీ శరీరాలకు తాకించానో, క్షణాలమీద చచ్చిపోగలరు,'' అంటూ వాళ్ళను హెచ్చరిస్తున్నాడు.

అంతలో అక్కడికి సిద్ధసాధకుడూ, సర్పనఖుడూ వచ్చారు. దూరం నుంచి కేకలు పెడుతూ నరభక్షకులూ, రాజు కనకాక్షుడి భటులూ కూడా అటే వస్తున్నారు. వాళ్ళను చూస్తూనే వెనుదిరిగి పారిపోవాలని ప్రయత్నిస్తున్న జలవృకరాక్షసులతో వారి నాయకుడు, ''ఆగండి! మన రాజాజ్ఞ, వీళ్ళను ప్రాణాలతో పట్టలేకపోతే, చంపి రమ్మని గదా?'' అంటూ ఎగిరి రాతిగదతో దేవశర్మను కొట్టబోయాడు. దేవశర్మ ఒకడుగు వెనక్కు వేసి, ''నీకు చావు రాసిపెట్టి వుండగా, నేనేం చేయగలను!'' అంటూ తన చేతికర్రను వాడి శరీరానికి తాకించాడు. ఆ వెంటనే జలవృకరాక్షసుల నాయకుడు ఒక చావుకేకపెట్టి, కిందపడి గిలగిల తన్నుకోసాగాడు.

దేవశర్మ తన చేతికర్రను పైకెత్తి, ''ఒరే, ప్రాణాలతో వున్న జలవృకులారా, ఇదే నా హెచ్చరిక! సరోవరంలో వున్న మాయాసరోవరేశ్వరుడి కుమార్తె పద్మముఖికిగాని, కాంచనవర్మకుగాని ఏ కొద్దిపాటి హానిజరిగినా, మీ రాజుతోపాటు మిమ్మల్నందర్నీ, దుర్మరణం పాలుచేస్తాను, జాగ్రత్త, వెళ్ళి మీ రాజుతో చెప్పండి!'' అన్నాడు.

జలవృక రాక్షసులు హాహాకారాలు చేస్తూ, అరణ్యానికి అడ్డంపడి పారిపోసాగారు. సర్పనఖుడు, దేవశర్మను సమీపించి, గుర్రం దిగి, ''వైద్యదేవా! మాయాసరోవరేశ్వరుడూ, కాంచనమాలా, జయశీలుడూ జలవృకరాక్షసుల నుంచి రానున్న ప్రమాదం తెలియక, సరోవరం కేసిపోతున్నారు గదా, వాళ్ళను హెచ్చరించవద్దా?'' అన్నాడు.

''ఆ పని మీ అన్నదమ్ములూ, హంసల రథం తోలే సరోవరేశ్వరుడి అంగరక్షకుడూ చేయాలి, బయలుదేరండి!'' అన్నాడు దేవశర్మ.

సర్పనఖ, సర్పస్వరులు జలాశ్వాలను అదిలించి వేగంగా పరిగెత్తించసాగారు. అంగరక్షకుడు దాపులనున్న చెట్ల వెనక్కుపోయి హంసలరథాన్ని క్షణాల మీద ఆకాశంలోకి ఎగిరించాడు. నరభక్షకులు ఉత్సాహంగా కేకలు పెడుతూ, పారిపోతున్న జలవృకరాక్షసుల వెంటబడి, తరమసాగారు. - (ఇంకావుంది)





బేతాళ కథలు

# రెండు నెమళ్ళు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రివేళ, భీతిగొలిపే ఈ శ్మశానవాతావరణం, ఏదో సాధించితీరాలన్న పట్టుదల కారణంగా, నీకు అత్యంత సహజంగా కనబడుతున్నట్టు, నాకు అనుమానం కలుగుతున్నది. కానీ, ప్రకృతిలోని వైపరీత్యాలూ, అందులోని జీవరాసుల ప్రవర్తనా గురించిన అంచనా వేయవలసి వచ్చినప్పుడు, పండితులూ, పామరుల మధ్య ఎంతో భేదభావం గమనించగలం. ఇందుకు ఉదాహరణగా నీకు, చంద్రశర్మ అనే ఒక చిత్రకారుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:



ఒకానొకప్పుడు సువర్ణదేశాన్ని పాలించిన సువర్ణదేవ మహారాజు గొప్ప భూతదయా పరుడు. తనదేశంలోని ప్రకృతి పరిసరాలను కాపాడుకోవాలనీ, అందుకుగాను చెట్లకూ, అక్కడ నివసించే పశుపక్ష్యాదులకు కూడా ఎలాంటి హానీ జరక్కుండా రక్షించుకోవా లనీ అందరికీ చెబుతూండేవాడు. ఆయన ప్రతి సంక్రాంతికి ఎడ్లకు పరుగుపందాలతో పాటు వాటిలో చూడముచ్చటగా వుండేవాటికి మంచి బహుమతులు కూడా ఇస్తూండేవాడు. ప్రకృతి దృశ్యాలను అందచందాలతో చిత్రిం చిన చిత్రకారులను కూడా ఘనంగా సన్మా నించేవాడు.

రాజధానికి దాపునగల ఒక గ్రామంలో వున్న చంద్రశర్మ మంచి చిత్రకారుడు. ఎవరైనా తమ రూపచిత్రం కావాలని కోరితే, కొద్దిసేపట్లో చిత్రించి ఇచ్చేవాడు. అందువల్ల, ఎంతోమంది ధనవంతులు అతడిచేత తమ చిత్రాలను గీయించుకునేవారు.

ఒకసారి చంద్రశర్మ, రాజుగారు సంక్రాంతి నాడు ఏర్పాటుచేసే చిత్రకళా పోటీలలో పాల్గొన దలచి – రెండు అడుగుల పొడవు, ఒక అడుగు వెడల్పుగల చెక్కపలక మీద, రెండు అందమైన నెమళ్ళు పురివిప్పి ఒకదానికొకటి ఎదురుగా నాట్యం చేస్తున్నట్టు చిత్రించాడు.

ఆ చిత్రాన్ని చూసిన ఒకడు, "ఆహా, ఎంత అద్భుతం! పురివిప్పిన నెమళ్ళు కళ్ళ ఎదుట నాట్యం చేస్తున్నట్టే వుంది. దీన్ని ఇంటి ముఖ ద్వారానికి వేలాడదీస్తే, ఇంటికే చెప్పరానంత కళ వస్తుంది," అంటూ మెచ్చుకున్నాడు.

చిత్రకళలో పరిచయం వున్న మరొకవ్యక్తి, "మన చంద్రం, నెమలి కంఠం రంగులు బాగా కలిపాడు. ఆ రంగులు అలా ఎవరూ కలప లేరు; ఒకవేళ కలిపినా, ఆ మెరుపు రాదు. రాజుగారు చూస్తే, దీనికి వంద బంగారు నాణే లిచ్చి తనదిగా చేసుకుంటారు," అన్నాడు.

చంద్రశర్మ, ఈ పొగడ్తలు విని చాలా సంతో షించాడు. అతడికి తన చిత్రకళానైపుణ్యం పట్ల ఎంతో గర్వం కలిగింది. నెమళ్ళ చిత్రాన్ని పొగడేవారిని, "నిజంగా అంత బాగుందా?" అంటూ వాళ్ళచేత మరింతగా పొగడించు కున్నాడు. ఆ తర్వాత చిత్రాన్ని ఒక దుప్పటిలో చుట్టి ఇనుపపెట్టెలో భద్రపరిచాడు.

సంక్రాంతి రోజున చంద్రశర్మ, ఒక మిత్రుణ్ణి వెంటబెట్టుకుని, చిత్రపటంతో పోటీల్లో పాల్గొ నేందుకు, ఒక ఎద్దులబండిలో బయల్దేరాడు. పోటీదారులకు ముందు అర్హత పోటీలు ఏర్పాటు చేశారు. అందులో గెలిచినవారికి నిర్వాహకులు అర్హతపత్రాన్ని అందజేసి, వారి చిరునామాలను రాసుకుంటున్నారు.

చంద్రశర్మ తన చిత్రాన్ని వాళ్ళకు చూపించాడు. పోటీ నిర్వాహకులు, ఆ చిత్రాన్ని చూసి ముగ్ధులై పోయారు.

మహారాజుక్కూడా చిత్రం బాగా నచ్చింది. ''ఇది బహుమతికి ఎంతగానో అర్హమైన చిత్రం!'' అంటూ మెచ్చుకున్నాడాయన. అక్కడ వున్న ఆస్థానపండితులు కూడా అవు నన్నట్టు తలలూపారు.

ఆ సమయంలో అక్కడ వున్న ఆస్థాన ఉద్యోగి ఒకడు, మహారాజుతో, ''ప్రభూ! ఈ సంక్రాంతి ఉత్సవాల్లో ప్రథమబహుమతి పొందడానికి ఎన్నిక కాదగిన చిత్రమే ఇది; సందేహం లేదు! పురివిప్పి నాట్యం చేస్తున్న నెమళ్ళ వెనుకవున్న వృక్షాలను కూడా అతి సహజంగా చిత్రించాడు చిత్రకారుడు. దృశ్యం నయనానందకరంగా వున్నది,'' అన్నాడు.

ఆస్థానోద్యోగి మాట ముగించగానే, ఎడ్ల పందాలలో పాల్గొనడానికి వచ్చిన ఒక రైతు వెంటవున్న కోయవాడొకడు, వచ్చే నవ్వును ఆపుకోలేక పెద్దగా నవ్వేశాడు. అది చూసి మహారాజుతోపాటు చంద్రశర్మా, ఇతరులూ కూడా వాడికేసి కోపంగా చూశారు. అది గమ నించి, తనవల్ల ఏదో అపచారం జరిగిందన్న భయంతో, అక్కడినుంచి వెళ్ళబోతున్న కోయ వాణ్ణి, మహారాజు ఆగమని, శాంతస్వరంతో, ''ఒరే, ఇంతకూ ఈ చిత్రం నీకు బావున్నట్టా లేదా! ఎందుకలా నవ్వావు?'' అని అడిగాడు.

అందుకు కోయవాడు, ఏం చెప్పాలా అని తడబడుతుండగా, తిరిగి మహారాజే, ''భయ పడకు! నవ్విన కారణం వినాలని వుంది. అడవిప్రాంతాల నివసించేవాడివి కదా, నీకు పురివిప్పి నాట్యమాడే నెమళ్ళ గురించి సర్వం తెలిసివుండాలి మరి!'' అన్నాడు వ్యంగ్యంగా.



తను అడగాలనుకున్న ప్రశ్నలాంటిదే మహారాజు అడిగినందుకు, చంద్రశర్మకు చాలా సంతోషం కలిగింది. కోయవాడు, మహారాజుకేసీ, చంద్రశర్మకేసీ ఒకసారి తల తిప్పి చూసి, ''అయ్యా, ఈ బొమ్మలో చాలా పెద్ద తప్పు వుండిపోయింది,'' అన్నాడు.

''అలాగా! మాకు తెలియక, నీకు మాత్రమే తెలిసిన ఆ తప్పేమిటి?'' అని అడిగాడు రాజు.

''అయ్యా, పురివిప్పేది మొగనెమలే, ఆడ నెమలి కోడిలాగా వుంటుంది. దాన్ని ఆకట్టు కోవడానికి మొగనెమలి అలా పురివిప్పి నాట్య మాడుతుంది. ఒక పోతునెమలి మరి ఒక పోతునెమలి దగ్గర ఎన్నడూ పురి విప్పదు. దెబ్బ లాడదలిస్తే తప్ప లేకపోతే దాపులకే రాదు!'' అన్నాడు కోయవాడు.

కోయవాడి మాటలు, మహారాజుతోపాటు సభలో వున్నవారందరికీ ఆశ్చర్యంతో పాటు

చాలా కోపం తెప్పించినై. ఐతే, చంద్రశర్మ, కోయవాడికేసి ఒకసారి తల ఎత్తిచూసి, చప్పున తలవంచుకుని, తన చిత్రాన్ని దుప్పటిలో చుట్టి చేతబట్టుకుని,మహారాజుకూ, సభకూ ఒకసారి నమస్కరించి అక్కడినుంచి వెళ్ళి పోయాడు.

బేతాళుడు ఈ కథచెప్పి, ''రాజా, చంద్రశర్మ చిత్రించిన నెమళ్ళ చిత్రాన్ని మహారాజుతో పాటు, రాజోద్యోగులూ, పండితులూ కూడా గొప్పచిత్రమంటూ మెచ్చుకున్నారు. అటు వంటప్పుడు, చిత్రకళ గురించి ఏమాత్రం తెలి యని ఒక కోయవాడు, దానిలో ఏదో తప్పు వున్నదనడం, వాడిఅజ్ఞానానికితార్కాణం కాదా? అలాగే, కోయవాడి మాటలకు ఏమాత్రం ఆగ్రహించకుండా, చంద్రశర్మ పోటీనుంచి విరమించుకుని, సభనుంచి వెళ్ళిపోవడం, చిత్రకారుడిగా అతడి అపరిపక్వతను తెలియ జేయడం లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''కోయవాడు, నాగరికులకు దూరంగా నిండు ప్రకృతిలో జీవనం సాగించే వ్యక్తి. వాడికి అక్కడి పశు పక్ష్యాదుల గురించి క్షుణ్ణంగా తెలుసు. చంద్ర శర్మ చిత్రించిన నెమళ్ళ చిత్రం వాస్తవానికి, పక్షుల సైజానికి నూటికి నూరుపాళ్ళు విరు ద్ధమైనది. ఆ కారణం వల్లనే వాడు, చంద్రశర్మ చిత్రంలో తప్పు వున్నదన్నాడు. ఇది అజ్ఞానం కాదు; వాడి ప్రకృతి పరిశీలనాశక్తికి తిరుగులేని తార్కాణం. ఇక, చంద్రశర్మ విషయానికొస్తే, అతడు చేయి తిరిగిన చిత్రకారుడే కావచ్చు. కానీ, అతడి చిత్రకళ వాస్తవానికి దరిదాపులకు కూడా రాలేదు. అతడిది నేలవిడిచిన సాము లాంటిది. పోతే, మహారాజునూ, ఇతర సభికు లనూ చిత్రంలో వున్న అందమైన నెమళ్ళూ, వాటి చిత్రణకుగాను చంద్రశర్మ ఉపయో గించిన అద్భుతమైన రంగుల మేళవింపూ, పూర్తిగా ఆకట్టుకున్నవి. అందుచేతనే వాళ్ళు, ఆ చిత్రం బహుమతికి అర్హం అన్నారు. అయితే, కోయవాడిమాటలతో, నిజాయితీపరుడైన చంద్రశర్మ, తనలో ప్రకృతి పరిశీలన లోపిం చిందని గ్రహించి, తన చిత్రాన్ని తీసుకుని మారు మాట లేకుండా సభనుంచి బయటికి వెళ్ళిపోయాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగిచెట్టెక్కాడు. - (కల్పితం)

[ఆధారం: గుడిసేవ మురళీధర్ రచన]





# అచ్చొచ్చిన హారం

కృష్ణరాజపురంలో ఒకప్పుడు జమీందారు లుగా వున్న రంగనాధరాజుగారి కుటుంబం అంటే అందరికీ ఎంతో గౌరవాభిమానాలు ఉండేవి. రంగనాధరాజు మరణించి కొంత కాలం అయినా, ఆయన భార్య రత్నావతమ్మ ఆధ్వర్యంలో, ఆయన నలుగురు కుమారులూ ఐకమత్యంగా వుంటూ అన్నదమ్ములంటే ఇలా ఉండాలి అనిపించుకునేవాళ్ళు. ఉమ్మడి కుటుంబంలో కోడళ్ళ మధ్య అడపాదడపా మనస్పర్థలు పొడసూపినప్పటికీ, అత్తగారి అజమాయిషీలో ఉన్నందువల్ల అవి బయటకు పొక్కేవి కావు.

ఆ ఇంట్లోని పాలేరు శివుడి భార్య గౌరి కాపురానికి రావడం, అందర్లోకీ చిన్నవాడైన రామరాజు కొడుకు బుల్లిరాజుకు నడక రావడం ఒకేసారి జరిగింది. గౌరి చక్కనిదే కాక, చాలా చురుకైనది. ఆ చలాకీతనమే రత్నావతమ్మకు బాగా నచ్చింది. వచ్చిన రెండు నెలల్లోనే గౌరి ఆమెకు ఆప్తురాలైపోయింది. ఇంట్లో ఆ పనీ, ఈ పనీ అందుకుని చేసే గౌరికి, అత్తగారు ఏదో ఒకటి చేతిలో పెడుతూ ఉండడం, ఆ ఇంటి కోడళ్ళకు కొంత కంటగింపుగా కూడా ఉండేది.

కొన్నాళ్ళకు రామరాజుకు కూతురు పుట్టింది. అంతవరకు తనను ఎంతో అపురూపంగా చూసుకున్న ఇంట్లోనివాళ్ళందరూ, ఒక్కసారిగా అప్పుడే పుట్టిన బుల్లి చెల్లెలిమీద ప్రేమ కనబరచడం, బుల్లిరాజుకు బాధ కలిగించింది. పైగా తాను చెల్లెల్ని తాకితే కసురుతున్నారు. అందువల్ల వాడు తరచూ చెల్లెల్ని గిల్లడానికీ, గిచ్చడానికీ పూనుకునే వాడు. రోజు రోజుకూ బుల్లిరాజు ఆగడాలు ఎక్కువ కావడంతో పుట్టినశిశువు క్షేమం కోరి, కొన్నాళ్ళు వాణ్ణి పాపకు దూరంగా పట్నంలోని మేనమామ ఇంట్లో ఉంచడం మంచిదనుకున్నారు.

అయితే, ఆ సంగతి చెప్పగానే బుల్లిరాజు, తల్లిని వదిలి వెళ్ళనని మారాం చేయసాగాడు. అప్పుడు గౌరి వాణ్ణి బుజ్జగించి, మంచిమాట

నందిరాజు పద్మలతా జయరాం



లతో ఒప్పించి, మేనమామ ఇంటికి తాను వస్తానన్నది. అప్పుడు బుల్లిరాజు ఒప్పుకున్నాడు. గౌరి పుట్టినిల్లుకూడా పట్నంలో ఉన్నది. బిడ్డకు గౌరిని తోడిచ్చి, పట్నంలోని బుల్లిరాజు మేనమామ ఇంటికి బండిలో పంపారు.

ఆ రోజే పెద్దకోడలు చంద్రమతి రోజూ మెడలో ధరించే చంద్రహారం కనిపించకుండా పోయింది. స్నానం చేయడానికి ముందు హారాన్ని తీసి పూజగదిలో ఉంచిందిగాని, స్నానం అయ్యాక పూజలో పడి దానిని చూసుకోలేదు. మధ్యాహ్నం భోజనాలయ్యాక చూస్తే హారం కనిపించకపోయేసరికి, ఆమెకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. నాలుగుతరాల నుంచీ, ఆ ఇంట్లో పెద్దకోడలికి ఆ చంద్రహారం ఆనవాయితీగా ఇవ్వబడుతోంది. పైగా అది అచ్చొచ్చినహారం అని రత్నావతమ్మ నమ్మకం. ఇంట్లో అందరూ ఉండగానే హారం ఎలా పోయిందో, వచ్చిన దొంగ కేవలం దాన్నిమాత్రమే ఎలా ఎత్తుకుపోయాడో ఎవరికీ ఏమాత్రం అర్థం కాలేదు.

''ఈ మధ్య మీ అన్నగారి సుపుత్రుడు పట్నంలో చదువుకుంటున్నానని చెప్పి, చెడు తిరుగుళ్ళు తిరుగుతున్నాడని తెలిసింది. సందేహం లేదు. ఖర్చులకు చేతుల్లో డబ్బులు ఆడక, వాడే తల్లిగారి గొలుసును కాజేసి ఉంటాడు,'' అన్నది భర్తతో రెండవ కోడలు కామేశ్వరి.

''ఏ పుట్టలో ఏ పాముందో ఎవరు చెప్పగలరు? వినయంగా మంచి అమ్మాయిలా కనిపించినా, చేసేవిమాత్రం దొంగపనులే. మీ రెండో అన్నయ్య కూతురు, ఆ మధ్య నాకు చెప్పకుండానే నా చెంపస్వరాలు తీసి పెట్టుకుని బడికి వెళ్ళింది. నేను గుర్తుపట్టి తీసేసుకున్నాను. ఇప్పుడు దానికి ఆ చంద్రహారం మీద మనస్సై, పెట్టుకుని వెళ్ళి ఎక్కడైనా పారేసిందేమో!'' అని గొణిగింది మూడో కోడలు రాజ్యలక్ష్మి తన భర్తతో.

''అత్తయ్యా, మీరేమైనా చెప్పండి. పనివాళ్ళకు అంత అలుసు ఇవ్వకూడదు. ఎవరిని ఎక్కడ పెట్టాలో అక్కడే పెట్టాలి. ఆ పిల్ల మీరిచ్చే చనువుకొద్దీ గౌరి ఎంతసేపూ ఇంట్లోనే తిరుగుతూంటుంది. నాకేమో దానిమీదే అనుమానంగా ఉంటోంది,'' అన్నది నాలుగో కోడలు.

''బుల్లిరాజుకు తోడుంటానన్న నెపంతో, హారాన్ని తల్లిగారింటికి దాటవేయడానికే అది పట్నం వెళ్ళిందో, ఏమో,'' అని వంత పాడింది పెద్దకోడలు.

గౌరిమీద అనుమానపడలేకపోయింది రత్నావతమ్మ. అలా అని ఇంకెవరినీ కూడా అనుమానించేట్టు లేదు పరిస్థితి. మౌనంగా ఊరుకున్నది.

నెల రోజులు దాటినా హారం ఆచూకీ తెలియలేదు. పట్నం వెళ్ళిన గౌరి, బుల్లిరాజుతో సహాతిరిగి వచ్చింది.

ఆ రోజు సాయంకాలం పెద్దకొడుకు సూర్యనారాయణరాజు పాలేరు శివుణ్ణిపిలిచి, ''ఒరేయ్, నిన్ను ఇంటి పాలేరుగా కాకుండా మా అన్నదమ్ముల్లో ఒకడిగా భావిస్తున్నాను. నువ్వొక సహాయం చెయ్యాలి. ఎంతయినా నీ భార్య గౌరి చిన్నపిల్ల. ఏదో తెలియనితనంతో హారం తీసిందేమో లాలనగా అడిగి చూడు,'' అంటూ మర్యాదగా చెప్పాడు.

శివుడు ఆ రాత్రే భార్యను అడిగాడు. గౌరి నేరుగా రత్నావతమ్మగారి దగ్గరికి వచ్చి, ''పెద్దమ్మగారూ, మీరు మా నాయనమ్మ లాగా అనిపించారు. అందుకే మీతో అంత చనువుగా ఉన్నాను. చెప్పిన పనులు చేయడంతప్ప మరొకటి తెలియదు. లేనివాళ్ళమే గాని దొంగబుద్ధి మా వంశంలోనే లేదమ్మా. ఏ ప్రమాణం చేయమన్నా చేస్తాను,'' అంటూ వలవలా ఏడ్చింది.

గౌరిని ఎలాగో సమాధానపరచి పంపేసినా, రత్నావతమ్మకు అచ్చొచ్చిన హారం పోయిందే అన్న బెంగమాత్రం రోజు రోజుకూ ఎక్కువ కాసాగింది.

అంతలో వేసవి ఎండలు ముదిరిపోయాయి. ఒకనాడు శివుడు వచ్చి, ''అయ్యా, పెరటి బావి దాదాపుగా ఎండిపోయింది. పూడిక తీయించాల్సిందే. పనివాళ్ళను పురమాయించమన్నారా?'' అని అడిగాడు సూర్యనారాయణ రాజును.



ఊరంతా నీటి ఎద్దడి ఉండడంతో ఆయన సరే అన్నాడు.

పూడిక తీసే పనులు ఆరంభమయ్యాయి. ఇంట్లోనివాళ్ళందరూ బావి దగ్గరే చేరారు. పని వాళ్ళు బావిలోనుంచి బురదమన్ను తట్టలతో తీసి ఒకరికొకరు అందించుకుంటూ ఎత్తి బయట పోస్తున్నారు. నాలుగు తట్టలు తీసే సరికి, బావిలో నుంచి గిన్నెలూ, లోటాలూ ఒక్కొక్కటిగా బయటపడసాగాయి. మట్టి కూరుకుపోయిన ఏనుగు అంబారీ బొమ్మ బయటపడేసరికి, అంతవరకు నాయనమ్మ ఒడిలో బుద్ధిగా కూర్చున్న బుల్లిరాజు ఛెంగున కిందికి దూకి, "ఆహా! నా బొమ్మ దొరికింది. ఈ ఏనుగుబొమ్మ నేనే పడేశా... నా బొమ్మ దొరికింది!" అంటూ ఆ బొమ్మను అందుకున్నాడు.

"ఇంకా ఏమేం పడేశావమ్మా, బుల్లి రాజూ చెప్పు, తండ్రీ" అంటూ నాయనమ్మ వాణ్ణి ఆప్యాయంగా దగ్గరికి తీసుకుంటూ అడిగింది నవ్వుతూ.

"ఇవన్నీ నేనే పడేశా. ఇంకా ఎన్నో పడేశా!" అన్నాడు బుల్లిరాజు ఎంతో గొప్పగా వచ్చీరాని మాటలతో.

ఇంకొంచెం మట్టి తవ్వి తీసేసరికి అందులో నుంచి మిలమిలా మెరుస్తూ చంద్రహారం బయటపడింది!

చెల్లెల్ని తాకితే కసిరారన్న కోపంతో, అందిన వస్తువులను విసిరికొట్టే అలవాటు గల బుల్లిరాజు, ఆ రోజు కనిపించిన హారాన్ని తీసి బావిలోకి విసిరాడన్నమాట. ఆ సమయంలో దానిని ఇంట్లోనివారు ఎవరూ గమనించలేదు!

రత్నావతమ్మ మనవడి తల నిమురుతూ, "మన బుల్లిరాజు చేసిన ఆ పని మనలో ఎన్నెన్నో అనుమానాలకు దారితీసింది. అయినా, ముందూ వెనకా ఆలోచించకుండా తొందరపడి ఎవరినీ అనుమానించకూడదు. ఎందుకంటే అనుమానించడం కూడా ఒక విధంగా అవమానించడంలాంటిదే. నిరపరాధుల మనసు నొప్పించడం భావ్యం కాదు. అందుకే ఇన్నాళ్ళు ఇంత ఓర్పు వహించాను. ఎలాగైతే నేంఇప్పుడు అందరి అనుమానాలూ పటాపంచలైపోయాయి. మన అచ్చొచ్చిన హారమూ దొరికిపోయింది!" అన్నది సంతోషంగా నవ్వుతూన్న కొడుకులూ, కోడళ్ళూ, శివుడూ, గౌరికేసి చూస్తూ.



మనపూర్వగాథలు-16

# జమీందారు మానవత్వం!

సంవత్సరమంతా ఎదురుచూసిన దుర్గాపూజ ఉత్సవ సమయం రానేవచ్చింది. మట్టితో చేసిన కాళీమాత విగ్రహాన్ని జమీందారు భవనంలోని విశాలమైన గదిలో ప్రతిష్ఠించారు. జమీందారు ఇంట్లో జరుగుతున్న పూజలో పాల్గొనడానికి ఆయన ఆహ్వానం మేరకు దూరప్రాంతాల నుంచి కూడా కొందరు బంధుమిత్రులు వచ్చారు. జమీందారు వాళ్ళకు చిరునవ్వుతో ఆప్యాయంగా స్వాగతం పలికాడు.

మేళతాళాలతో పూజాకార్యక్రమం ఆరంభమయింది. పూజారులు మంత్రాలు వల్లించసాగారు. దుర్గామాత దర్శనం కోసం వందలాదిమంది స్త్రీ పురుషులు జమీందారు భవనం ముందు గుమిగూడారు.

పూజా విధిలో ముఖ్యమైన భయానక ఘట్టం ఆరంభమయింది. కాళీ విగ్రహం ముందు మేకపోతులను బలి ఇచ్చారు. ఆ దృశ్యాన్ని చూసి కొందరు భక్తితో శివమెత్తి లెంపలు వేసుకుంటే, మరికొందరు దానిని చూడలేక తలలు తిప్పుకున్నారు. ఇంకా కొందరు భయంతో కళ్ళు మూసుకున్నారు.

పూజాకార్యక్రమం పూర్తయ్యాక, అక్కడ బలి ఇచ్చిన మేకపోతులను కోసి విందుభోజనం ఏర్పాటుచేశారు. ఊరి ప్రజలూ, దూరప్రాంతాల నుంచి వచ్చిన బంధుమిత్రులూ, రుచికరమైన మేకపోతులమాంసంవంటకాలను కావలసినంత తిన్నారు. కాళీ పూజలో వాళ్ళు ఆతురతగా ఎదురు చూసింది కూడా ఈ విందుభోజనం కోసమే!

విందుభోజనాలుపూర్తయ్యాకబంధుమిత్రులు కాళీమాత ప్రసాదం పుచ్చుకుని, జమీందారు వద్ద సెలవుతీసుకుని, వచ్చేయేడు ఉత్సవం ఎప్పుడు వస్తుందా అన్న ఆశతో సంతోషంగా బయలుదేరారు.





ఇలా యేటా ఉత్సవాలతో, విందుభోజనాలతో కొన్నేళ్ళు గడిచిపోయాయి. ఒకసంవత్సరం ఉత్సవ సమయం దగ్గరపడింది. పూజకు ఏర్పాట్లు ఆరంభ మయ్యాయి. యేటా కాళీమాతకు బలి ఇవ్వడానికి మేకపోతులు అమ్మే మేకల కాపరి, ఈ యేడు ఎన్ని మేకపోతులు కావాలో తెలుసుకుని వెళ్ళడానికి వచ్చాడు. వాణ్ణి చూడగానే, ''వద్దు. ఇకపై జంతు బలులు వద్దు!'' అన్నాడు జమీందారు చౌదరి.

ఆ మాట విని మేకలకాపరి హతాశుడయ్యాడు. అక్కడున్న జమీందారు మిత్రులూ, సిబ్బందీ కూడా దిగ్భ్రాంతి చెందారు. ఎంతోకాలంగా వస్తూన్న సంప్ర దాయాన్ని ఇప్పుడు జమీందారు ఎలా కాదనగలరు? పైగా తమకు కావలసినంత విందుభోజనం తినడం అన్నది ఆ ఉత్సవం రోజున మాత్రమే సాధ్యం. ఆ అవ కాశం కూడా చేజారిపోతూంటే ఊరుకోగలరా?

వాళ్ళల్లో కొందరు జమీందారు భార్యను కలు సుకుని, ''అమ్మా, తమరు కరుణామయులు. మనస్సాక్షి కలిగినవారు. కాళీమాత సంవత్సరానికి ఒక్కసారి తమ ఇంటికి వస్తుంది. ఆమెకు ఇష్టమైన ఆహారాన్ని ఇవ్వకుండా ఉండవచ్చా? మనల్ని గురించి ఆ తల్లి ఏమనుకుంటుంది? వచ్చి వెళ్ళాక మనల్ని గురించి ఇతర దేవతలతో ఏం చెప్పగలదో ఆలోచించి చూడండి. ఇన్నాళ్ళూ చక్కగా జరిపిన దానిని ఇప్పుడు ఆపడం సబబుగా ఉంటుందా,'' అని మొరపెట్టుకున్నారు.

''నిజానికి, దేవతావిగ్రహం ముందు జంతు బలులివ్వడం నాకు ఇష్టం లేదు. భక్తితో ప్రార్థిస్తు న్నప్పుడు జంతువులను బలి ఇవ్వడం ఆ వాతావర ణాన్ని భయంతో నింపుతుంది. ఇది మనుషు లుగా చేయకూడనిపని. ఇప్పటికైనా జమీందారు గారికి జీవహింస, రక్తపాతం కూడదనే మంచి ఆలో చనరావడం మనమంతా సంతోషించతగ్గ విషయం. ఇకపై ఆయన జంతుబలులను అనుమతించ రనుకుంటాను,'' అన్నది జమీందారు భార్య.

అయినా వెళ్ళినవాళ్ళు ఒకపట్టాన వదల కుండా, జంతుబలులు ఇవ్వడానికి జమీందా రును ఎలాగైనా ఒప్పించమని ఆమె కాళ్ళా వేళ్ళా పడి వేడుకున్నారు.

ఆ రోజు సాయంకాలం జమీందారు తీరిగ్గా వాలుకుర్చీలో కూర్చుని ఉన్నాడు. సేవకుడు కాళ్ళు



అసలు సత్యాన్ని గ్రహించడం ద్వారా ఆత్మనిగ్రహాన్నీ, మనశ్శాంతినీ అలవరచుకున్నప్పుడు సందేహాలన్నీ సమసిపోతాయి. - శ్రీమద్భాగవతం

పడుతున్నాడు. అప్పుడు ఆయన భార్య ఆయన్ను సమీపించి పక్కగా నిలబడి, ''ఉత్సవాల గురించి నాకొక అనుమానం,'' అన్నది మెల్లగా.

ఏమిటి అన్నట్టు చూశాడు జమీందారు.

''జంతువులను బలి ఇవ్వడం ఉత్సవాలలో ప్రధాన అంశంగా ప్రజలు భావిస్తున్నారు. దేవతకు కూడా అవి చాలా ఇష్టమని విజ్ఞులైన తమ మిత్రులే చెబుతున్నారు. ఇది నిజమేనా?'' అని అడిగింది భార్య.

చౌదరి కోపంతో లేచి నిలబడి, ''విజ్ఞులైన మిత్రులు! నువ్వు వాళ్ళను అన్నీ తెలిసిన వారని అంటావా? వాళ్ళలాగే నీకూ మానవత్వమన్నది లేకుండా పోయిందా?'' అన్నాడు బాధతో నిండిన స్వరంతో.

జమీందారు భార్య నోటమాట రాలేదు. తన భర్తఅహింసపట్ల ఆకర్షితుడు కావడం జంతుబలులివ్వడం అమానుషమని భావించడం ఆమెకెంతో ఆనందం కలిగించింది.

''దయచేసి నన్ను అపార్థంచేసుకోకండి. నేను మానవత్వం లేనిదాన్ని కాను,'' అన్నది బాధగా.

''నీకు మానవత్వం ఉందా? మరి నా పట్ల ఎందుకు అంత అమానుషంగా ప్రవర్తిస్తున్నావు? ఇటీవల నేను చేపలు మాత్రమే తింటున్నాను; మాంసం ముట్టుకోవడం లేదని చూస్తున్నావా లేదా? పోయిన యేడాదే సగం పళ్ళు ఊడిపోయాయి. ఎలాగో కష్టపడి అతి ప్రయత్నం మీద మాంసాన్ని నమిలి మింగగలిగాను. ఇప్పుడు నా పళ్ళన్నీ ఊడిపోయాయి. ఒక ముక్కను కూడా నమలలేను. చుట్టూ నా అతిథులందరూ మాంసం తింటూంటే నన్ను శాకాహారంతో సరిపెట్టుకోమంటావు.అంతేనా? నువ్వుకోరుకునేది అదే కదా! అది నాపట్ల అమానుషత్వమా, కాదా? చెప్పు,'' అన్నాడు జమీందారు.

తన భర్త అహింసకు అర్థం దానిని ఆయన పాటించడానికి కారణం ఏమిటో గ్రహించిన జమీందారు భార్య మౌనంగా ఉండిపోయింది.

-బిందుసార్








## చాలా అందమైనది!

భారతీయ ద్రవ్యమానం రూపాయి అన్న సంగతి ఎవరూ చెప్పనవసరం లేదు. అయితే, దీనికీపేరు ఎలా వచ్చిందో మీకు తెలుసా? మనదేశంలో మొగలుల పాలన అక్బర్ చక్రవర్తి నుంచి బహదూర్ షా వరకు ఏకధాటిగా నిరంతరాయంగా సాగలేదు. మధ్యలో పదిహేను సంవత్సరాల పాటు మొగలులు అధికారంలో లేరు. ఆ కాలఘట్టంలోనే ఢిల్లీ సుల్తాన్ షేర్ షా సూరీ, హుమయూన్ చక్రవర్తిని భారత్ నుంచి తరుమగొట్టాడు. తన విజయాన్ని చాటడానికి సుల్తాన్ ఒక నాణాన్ని విడుదల చేయాలనుకున్నాడు. 1542 వ సంవత్సరంలో 178 గ్రాముల బరువుతో ఒక వెండినాణెం తయారుచేయబడింది. దానిని చూసిన షేర్ షా సూరి ఆనందాతిరేకంతో, ''రూపైయా!'' (చాలా అందంగా వుంది) అన్నాడు. ఆ పేరే నాణానికి స్థిరపడిపోయింది.

## ఊగే మసీదు గోపురాలు!

ఇటలీలోని పీసా వాలుగోపురం ఆధునిక ప్రపంచ వింతలలో ఒకటిగా ఉంటున్నది. గుజరాత్‌లోని అహ్మదాబాద్‌లో దానిని పాలించిన అహ్మద్ షా 1454 వ సంవత్సరంలో నిర్మించిన ఆయన భార్య బీబీ మసీదుకు రెండు (మీనార్లు) గోపురాలున్నాయి. ఇవి ఈ నగరానికే ప్రత్యేక శోభను కల్పిస్తున్నాయి. ఎవరైనా ఈ జూలామీనార్‌పై ఆనుకుని తోస్తే చాలు ఊగేది (జూలా అంటే ఊయల). బ్రహ్మాండంగా కనిపిస్తూ చూపరులకు ఆనందం కలిగించిన ఈ గోపురాలు ఎందుకిలా ఊగేవో తెలియదు. ఇలాంటి ప్రత్యేకతను సంతరించుకున్న ఈ మసీదు గోపురాలు 2001 లో వాటిల్లిన ఘోర భూకంపంలో కదిలిపోయాయి. అదృష్టవశాత్తు కూలిపోలేదు. 'ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా' పూనుకుంటే వీటిని పునరుద్ధరించవచ్చు.





# సంతోష రహస్యం

కృష్ణానది దాపునగల ఒక పెద్దగ్రామంలో, రంగమణి పెద్ద ధనవంతురాలు. ఆమెకు తండ్రి నుంచి చాలా పెద్ద ఆస్తిపాస్తులు సంక్రమించాయి. యాభైఎకరాల మాగాణి, ఇరవై గేదెల పాలవ్యాపారం, ఎకరం నేలలో పెద్ద భవనం, పాతికమంది పనివాళ్ళు ఆమె ఆధీనంలో వున్నారు. భర్త సుందరమూర్తిని ఏ విషయంలోనూ సంప్రదించేది కాదు. అన్ని వ్యవహారాలూ స్వయంగా చూసుకోవడం, ఎవరినీ నమ్మకపోవడంతో, ఆమెలో క్రమంగా అశాంతి, గయ్యాళితనం పెరిగిపోయాయి.

ఒకనాడు సుందరమూర్తి ఆమెతో, ''చూడు, మణీ! ప్రశాంతంగా వుండలేనప్పుడు, మనిషికి ఎంత ఆస్తివున్నా నిష్ప్రయోజనం. నువ్వు రోజంతా ఎంత చిరాగ్గా, నిరుత్సాహంగా వుంటున్నావో, నేను గమనిస్తూనే వున్నాను. అన్ని వ్యవహారాలూ అనుకున్నట్టు విజయవంతం కావడం సాధ్యం కాదు. అందువల్ల ప్రశాంతంగా బ్రతకడం నేర్చుకోవాలి. డబ్బుకంటే, మనశ్శాంతి ప్రధానం!'' అన్నాడు.

భర్త మాటలు వినీ విననట్టు ఊరుకున్నది, రంగమణి.

ఆ రోజు మధ్యాహ్నం భార్యాభర్తలు భోజనాలకు కూర్చున్నారు. ఎదురుగా వున్న బల్లమీద, వాళ్ళ అంతస్తుకు తగినవిధంగా వంటకాలు పెట్టివున్నాయి. అన్నంలో దోసకాయకూర కలుపుకుని తినబోయిన రంగమణి, హఠాత్తుగా నోట్లోని అన్నం ముద్దను బయటికి ఊసేసి, కూరగిన్నెను విసురుగా కిందకు నెట్టి, ''చేదు దోసకాయల్ని ఎలా వండింది, ఈ సుబ్బక్క? ఆవిడకు కళ్ళు కనబడడం లేదా, లేక నాలుకకు రుచీపచీ తెలియకుండా పోయిందా?'' అంటూ కోపంగా భోజనం ముందునుంచి లేచింది.

సుందరమూర్తి, ఆమెను శాంతపరచాలని, ''ఆ కూర కాకుండా, ఇంకా రెండు మూడు కూరలున్నాయి. నీకిష్టమైన కాకరకాయ కూర కూడా వుంది. ముందు నువ్వు భోజనం ముగించు. తర్వాత సుబ్బక్క క్షమాపణ చెప్పుకుంటుందిలే,'' అన్నాడు.

జి. అంజమ్మ



కానీ ఆమాటలు వినిపించుకోకుండా ఆమె విసుక్కుంటూ చేయి కడిగేసుకుని, గదిలోకి వెళ్ళిపోయింది. కొద్దిసేపటి తర్వాత, సుందర మూర్తి గదిలోకి వెళ్ళి, ''రంగమణీ, నే చెప్ప బోయేది కాస్త శ్రద్ధగా విను! ఇక్కడికి ఆమడ దూరంలో వున్న మామిళ్ళపల్లెలో సాంబ అనే ఒక వృద్ధుడున్నాడట. ఆయన వయసు వంద దాటిందనీ, అందరూ ఆయన్ని, నూరేళ్ళ సాంబ శివ అని పిలుస్తారనీ విన్నాను. అశాంతి, అనారో గ్యంలాంటి మొండిలక్షణాలకు, ఆయన తిరుగులేని పరిష్కారం చెబుతాడట. రేపే బయలుదేరి వెళ్ళి, ఆయన్ని చూసి వద్దాం,'' అన్నాడు.

రంగమణి ఏకళనున్నదో ఏమో, అడ్డు పలకకుండా సరే అన్నట్టు తల ఊపింది.

మర్నాడు భార్యాభర్తలిద్దరూ గుర్రపు బండిలో, సాంబశివ దర్శనానికి వెళ్ళారు. ఆయన వున్న ఒక విశాలమైన గదిలో అడుగు పెడుతూనే రంగమణి, ఆయనకు నమస్క రించి, ''నా పేరు రంగమణి! చాలా ఆస్తిపా స్తులూ, ఇంటా బయటా నౌకర్లూ చాకర్లూ వున్నారు. వాళ్ళంతా నాకంటే ఆనందంగా, ప్రశాంతంగా జీవితం గడుపుతున్నారు. నాకూ అలాంటి ప్రశాంతత కావాలి,'' అన్నది.

కళ్ళు మూసుకుని, ఆమె చెప్పినదంతా శ్రద్ధగా విన్న వృద్ధుడు కళ్ళుతెరిచి, చిరునవ్వుతో, ''మీ ఇంటి ఇరుగుపొరుగున గాని, లేక మరె క్కడైనా, అన్నివేళలా సంతోషంతో, ఆనందంగా వుండే,ఒక ఇల్లాలిని వెంటబెట్టుకురా: అప్పుడు నీకు, ఎప్పుడూ ఆనందంగా జీవితం గడిపే రహస్యం చెబుతాను,'' అన్నాడు.

భార్యాభర్తలిద్దరూ, సాంబశివకు నమస్క రించి ఇంటికి తిరుగుప్రయాణమయ్యారు. దారిలో ఒకచోట ఇద్దరు స్త్రీలు చేతుల్లో తట్టలు పట్టుకుని నవ్వుతూ మాట్లాడుకుంటూ వెళు తున్నారు. వాళ్ళను చూడగానే రంగమణి బండిని ఆపించి, ''మీ వృత్తి ఏమిటి? మీరు ఎప్పుడూ ఇంత సంతోషంగా వుంటున్నారా?'' అని అడిగింది.

అందుకు ఒక స్త్రీ, ''ఊహు, అలాంటిదేం లేదు.ఈ రోజునమేం సంతకు తీసుకుపోయిన కూరగాయలు త్వరగా అమ్ముడుపోయాయి. వర్షంలాంటిది వస్తే, ఇంట్లోంచి బయటికే రాలేం. అలాంటప్పుడు పస్తులుండవలసి వస్తుంది. ఇక సంతోషం అంటూ ఎక్కడ!'' అన్నది విచారంగా.

ఈ జవాబు విని రంగమణి నిరుత్సాహం చెందింది. తర్వాత గుర్రపుబండి ఒక గ్రామ వీధిలోంచి పోతూండగా కొందరు జనం, ''మాతా గాయత్రీ!'' అంటూ పాడుతూ,

ఆనందంగా నృత్యం చేస్తున్నారు. రంగమణి బండిని ఆపించి, ''ఎవరా మాతా గాయత్రి?'' అని అడిగింది.

దానికి ఒక భక్తుడు, ''గాయత్రిమాత, ఆ కనబడే మామిడి తోటలోని కుటీరంలో వుంటుంది. ఆమె గొప్ప సన్యాసిని. ఎప్పుడూ ఆనందంగా నవ్వుతూ, దేవుణ్ణి గురించిన భక్తిప్రధానమైన కథలు చెబుతూంటుంది,'' అని చెప్పాడు.

రంగమణి, సుందరమూర్తి గుర్రపుబండి దిగి, సన్యాసిని దగ్గరకు వెళ్ళారు. రంగమణి ఆమెకు నమస్కరించి, ''మాతాజీ, మీరు నిత్యసంతోషి అని జనం చెప్పుకుంటున్నారు. మీరు సుఖదుఃఖాలకు అతీతులై వుంటారు, అవునా?'' అని అడిగింది.

అందుకు సన్యాసిని, ''నేను సన్యాసిని కావటంవల్ల కుటుంబపరంగా, ఆస్తిపరంగా ఎటువంటి బాధలూ లేవు. అయినా నేను నిత్యసంతోషిని కాదు,'' అన్నది.

ఈ జవాబు విని భార్యాభర్తలు వింత పడ్డారు. అది గ్రహించిన మాతాజీ సన్యాసిని, ''నేను సన్యాసం స్వీకరించాక, ఎన్నో శ్రమల కోర్చి కొన్ని యోగవిద్యలు నేర్చుకున్నాను. ఆ కారణంవల్ల, మరొక ఐదు సంవత్సరాల్లో నాకు మృత్యువు రాబోతున్నదని తెలిసింది. ఇది నన్ను భయపెడుతున్నది. రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టడంలేదు,'' అంటూ కళ్ళ నీళ్ళు తుడుచుకున్నది.

భార్యాభర్తలు మారుమాట్లాడకుండా, అక్కడి నుంచి తమ గ్రామానికి బయలు దేరారు. దారిలో వాళ్ళొక గ్రామ వీధినుంచి వెళుతూండగా, ఒక గుడిముందు చిన్న బల్ల మీద మల్లెపూలూ, పూలదండలూ పెట్టి



అమ్ముతున్న ఒక స్త్రీ, కూనిరాగాలు తీస్తూ ఏదో పాడు కుంటున్నదల్లా, వాళ్ళను చూసి, ''రండి, రండి! ఈ ఉదయానే కోసిన పూలు. చెప్పలేనంత సువాసనగా వున్నాయి,'' అన్నది నవ్వుతూ.

రంగమణి బండి దిగి, ఆమెకేసి కొద్దిసేపు పరీక్షగా చూసి, ఒక పూలదండ తీసుకుని డబ్బు ఇస్తూ, ''చూడమ్మా నువ్వు చేస్తున్నది చాలా చిన్నవ్యాపారం. అయినా చాలా సంతోషంగా కనబడుతున్నావు. నువ్వు నిత్యసంతోషివా ఏం?'' అని అడిగింది.

''అవును, నాకేం తక్కువ? సంతోషంగానే ఉన్నాను,'' అన్నది పూలమ్మి నవ్వుతూ.

ఆమె జవాబుకు సంతోషించిన రంగమణి భర్తకేసి చూసింది. సుందరమూర్తి పూలమ్మితో, ''అమ్మా, ఒక ముఖ్యమైన సంగతి. నువ్వు నూరేళ్ళ సాంబశివ గురించి వినేవుంటావు. మా వెంట నువ్వాయనదగ్గరకు రావాలని

కోరుతున్నాం. నిన్ను తిరిగి బండిలో మీ ఇంటి దగ్గర దించుతాం,'' అన్నాడు.

ఆ రోజు వ్యాపారం కూడా అప్పటికి అయిపోయింది గనక, పూలమ్మి అందుకు సంతోషంగా ఒప్పుకున్నది. కొంతసేపటికి వాళ్ళు నూరేళ్ళ సాంబశివ దగ్గరికి వెళ్ళారు. రంగమణి ఆమెను గురించి సాంబశివకు చెప్పింది.

వృద్ధుడు పూలమ్మిని, ''నువ్వు నిత్య సంతోషివా?'' అని అడిగాడు.

''అవును,'' అన్నది పూలమ్మి.

''పూలమ్ముకునే చిన్న వ్యాపారం చేస్తూ ఎలా సంతోషంగా ఉండగలుగుతున్నావు?'' అని అడిగాడు వృద్ధుడు.

అందుకు పూలమ్మి ''అయ్యా, చేస్తున్న వ్యాపారం చిన్నది గనక, లాభాలూ చిన్నవిగానే వుంటాయి. అయినా, అది నా సంతోషానికి అడ్డురాదు. మాకు ఒక ఎకరం పొలం, చిన్న పూరిల్లూ ఉన్నాయి. నా భర్త పొలం పనులకు పోయి ఏదో కొంత సంపాదించి తెస్తాడు. అన్యోన్యంగా ఉంటూ పొదుపుగా కాపురం గడుపుకొస్తున్నాం. భర్తనూ, పిల్లలనూ ప్రేమగా చూసుకుంటాను. వీలయినంతలో ఇతరులకు సాయపడతాను. ఏదో కావాలనే గొంతెమ్మ కోరికలు లేవు. అందువల్ల నేనెప్పుడూ సంతోషంగానే వుంటాను,'' అన్నది.

కళ్ళు మూసుకుని అంతా శ్రద్ధగా విన్న నూరేళ్ళ సాంబశివ కళ్ళు తెరిచి రంగమణికేసి మందహాసం చేసి చూస్తూ, ''ఆ అమ్మాయి దగ్గర డబ్బూ, నగలూ లేవు. అవి నీ దగ్గర పుష్కలంగా ఉన్నాయి. అయినా ఆమె నిత్య సంతోషిగా ఉన్నది. కానీ నీలో సంతోషానికి స్థానం లేకుండా పోయింది. అందుకు కారణం - ఇన్ని ఆస్తిపాస్తులు ఉన్నప్పటికీ ఎవ్వరినీ నమ్మకుండా, అన్ని వ్యవహారాలూ నువ్వే చూసుకుంటూ, ఇంకా ఇంకా సంపాయించాలనే పేరాశతో శక్తికి మించి శ్రమపడడం. మనిషికి సంపదలు ముఖ్యమే. కాని అన్ని సంపదలకన్నా మనసు చాలా ప్రధానం. మన ఆలోచనలే మన సుఖదుఃఖాలను నిర్ణయిస్తాయి. తన నిత్యసంతోషానికి ఈ పూలమ్మి చెప్పిన కారణాలేమిటో బాగా గుర్తుంచుకోమన్నదే నా సలహా!'' అన్నాడు.

రంగమణి, సుందరమూర్తి తేలికపడిన మనస్సుతో సంతోషంగా వృద్ధుడికి నమస్కరించి, పూలమ్మిని వెంటబెట్టుకుని తమ గ్రామానికి బయలుదేరారు.



# చందమామ కబుర్లు

## ఘంటావాలా పాన్




వినోద్‌కుమార్ తివారీ ముంబాయిలో ఒక పాన్‌షాపు నడుపుతున్నాడు. ఆయన షాపుపేరు ఘంటావాలా పాన్‌మందిర్. అయనవద్ద ఒక్క గంట కాదు 18 దేశాలకు చెందిన 3 9 3 గంటలు ఉన్నాయి. వాటన్నిటినీ షాపులో ప్రదర్శనకు ఉంచాడు. అంతేకాదు, పాన్ కట్టి, కొనేవారికి అందించి డబ్బు పుచ్చుకోగానే ఒక గంట కొడతాడు. వచ్చినవారు పాన్ పట్టుకుని వెళ్ళేప్పుడు మరొకగంట కొడతాడు. పూణేలో అతని ముత్తాత 1 9 3 3 లో ఒక పాన్‌షాపు నడిపేవాడు. ఆయన వాడుకదార్లు వచ్చేప్పుడూ, పోయేప్పుడూ గంట కొట్టేవాడు. ఆ సంప్రదాయాన్నే వినోద్‌కుమార్ కొనసాగిస్తున్నాడు.

ఫ్రాన్స్ నుంచి గాజు గంట, టిబెట్‌నుంచి కొయ్య గంట, మనదేశంలోని 2 0 కి.గ్రా. బరువున్న ఇత్తడి గంటను ఆయనసంపాదించాడు. పాన్‌షాపు విజయవంతంగా నడపడంతోపాటు రకరకాల గంటలు సేకరించి, అతడు 'గిన్నిస్ బుక్ఆఫ్ రికార్డ్స్'లో స్థానం సంపాయించాడు.

## అతి పిన్నవయసులో 'బ్లాక్ బెల్ట్'

పూణేకు చెందిన బ్రాండన్ పాల్ ఫెర్నాండెజ్‌కు పన్నెండేళ్ళు. దక్షిణ కొరియా, సియోల్‌లో ఉన్న టేక్‌వాండో అకాడెమీ నుంచి 4వ పూమ్ బ్లాక్ బెల్ట్ ఇన్ టేక్ వాండో అందుకున్న అతి పిన్నవయస్కుడీ కుర్రవాడు. ఎక్కువమంది కొరియన్లు పాల్గొన్న 400 మంది పోటీదారులలో భారత్ నుంచి వెళ్ళిన ఏకైక పోటీదారు బ్రాండన్. గత నవంబర్ 1 5 నుంచి డిసెంబర్ 2 వరకు పోటీలు జరిగాయి. అప్పుడక్కడ ఎముకలుకొరికే చలి. అది కూడా ఈ పూణే కుర్రాడికి ఒక అపూర్వ అనుభవంగా మిగిలింది. పోటీ ఫలితాలు ఏప్రిల్‌లోనే ప్రకటించారు. బ్రాండన్ మరీ లేత వయసులో అంటే 1వ యేటనే శిక్షణ ప్రారంభించాడు!



## ఒరిస్సా జానపద కథ

ఈనాటి ఒరిస్సా ప్రాంతాన్ని ఒకప్పుడు ఉత్కళరాజ్యంగా పిలిచేవారు. అంతకు పూర్వం ఈ ప్రాంతం గొప్ప చక్రవర్తులు పరిపాలించిన కళింగ సామ్రాజ్యంగా పేరుగాంచింది.

వెయ్యి సంవత్సరాలకు పూర్వం ఇక్కడి ప్రజలు ఇండొనేషియా ద్వీపాలు, మలయా ద్వీపాలతో వర్తక వాణిజ్యాలు జరపడంతో పాటు, ఆ ప్రాంతాలలో తమ పాలనను కూడా నెలకొల్పారు. సుమత్రతో కలిపి సామ్రాజ్యం స్థాపించి, అక్కడొక స్థావరాన్ని నెలకొల్పినశైలేంద్రులు ఒరిస్సాకు చెందిన వారే.

బ్రిటిష్ పాలనా కాలంలో ఒరిస్సా అనేక సంవత్సరాలు బీహార్‌తో కలిసి ఉండేది. 1936 లోనే ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడింది. 1,55,707 చ.కి.మీ. విస్తీర్ణంగల ఈ రాష్ట్ర జనాభా నాలుగు కోట్లను అందుకోనున్నది. ఉత్తరంగా బీహార్, ఈశాన్యంగా పశ్చిమబెంగాల్; ఆగ్నేయ దిశలో ఆంధ్ర ప్రదేశ్; పశ్చిమంగా మధ్య ప్రదేశ్‌సరిహద్దు రాష్ట్రాలుగా ఉన్నాయి. తూర్పుదిక్కున బంగాళాఖాతం సరిహద్దుగా ఉంటోంది.

దేశంలో పేరుగాంచిన బ్రహ్మాండమైన దేవాలయాలుగల అతి ప్రాచీనమైన భువనేశ్వర్ నగరం ఒరిస్సా రాష్ట్ర రాజధాని.

# మహారాజు - అల్పజీవి

కళింగ సామ్రాజ్యంలోని జయపురి సంస్థానాన్ని పాలించే జయసింహుడనే యువకుడైన రాజుకు పొగడ్తలంటే మహాఇష్టం. అందువల్ల తియ్యటి మాటలతో ఆయన్ను అందరూ పొగుడుతూ ఉండేవారు.

ఒకనాడు రాజు ఆస్థానంలో అడుగుపెట్టగానే, ఆయన గుణగణాలను కీర్తిస్తూ, ఒక కవి ఒక పద్యాన్ని చదివాడు. ఆ పద్య భావం ఇది: ప్రపంచంలో ఎవరుగాని రాజు ఎదుట నిలబడి తామే గొప్పవాళ్ళమని చెప్పి విర్ర వీగలేరు. ఎలా చెప్పగలరు? రాజును మించిన సుందరపురుషుడు లేడు; దాన



గుణంలో రాజుకు సాటి రాగలవారు లేరు. రాజును మించిన శక్తిమంతుడు, ధనవంతుడు లేనేలేడు!

ఇది కేవలం అతిశయోక్తి అని తెలిసినప్పటికీ సభికులందరూ కవిని మెచ్చుకుంటూ చప్పట్లు చరిచారు. ''ఆహా, నిజం, నిజం! అక్షరాలానిజం!'' అంటూ కొందరు తెగపొగిడారు.

అయితే, చప్పట్లూ, సందడీ అణిగాక ఎవరో గట్టిగా నవ్వారు. అందరూ ఆ నవ్విన వ్యక్తికేసి ఆశ్చర్యంగా చూశారు. ఆయన ఎవరో కాదు; వృద్ధమంత్రి చంద్రహాసుడు.

''ఏమిటిసంగతి? ఎందుకలా నవ్వావు?'' అని అడిగారు కొందరు ముక్తకంఠంతో.

''పెద్దగా కారణం అంటూ ఏదీ లేదు. అయినా, గొప్పలు చెప్పుకునేవారిని ఎవరూ ఆపలేరు. స్వల్పవిషయాలకే గొప్పలు చెప్పుకునే అల్పులను రాజు సైతం ఆపలేడు. ఆ విషయం తలుచుకోవడంవల్లే నవ్వు ఆపుకోలేకపోయాను. తన తోకను గురించి కోతి గొప్పలు చెప్పుకోవచ్చు; తన ముక్కును గురించి రాబందు గొప్పలు చెప్పుకోవచ్చు. వాటిని ఆపడానికి ఎవరేం చేయగలరు?'' అన్నాడు మంత్రి.

ఆయన మాటలలో నిజం లేదని రాజుగాని, సభాసదులుగాని, నిరూపించలేకపోయారు. అయితే, రాజుకు మాత్రం మంత్రి మాటలు రుచించలేదు. వెగటు పుట్టించాయి.

ఆ రోజు సాయంకాలం రాజు ఉద్యానవనంలో పచార్లు చేస్తూండగా ఒక ఉడత అక్కడికి వచ్చింది. దానికెక్కడో ఒక చిన్న నాణెం దొరికింది. ఉడత ఆ నాణాన్ని ముందు కాళ్ళతో పట్టుకుని ఇలా పాడసాగింది:



''చూడుచూడు నావద్దఎంతఉందో చూడు!
రాజువద్ద ఏముంది మొహం నిండా విచారం!
లేదులేదు చిగురంత; లేదు గోరంత ధనం!''

రాజు ఉలిక్కిపడ్డాడు. అందిన గులకరాయి తీసి ఉడత మీదికి విసిరాడు. ఆ అల్పప్రాణి తప్పించుకుని పారిపోయింది. కాని, వెళ్ళే వేగంలో ఆ నాణాన్ని అక్కడే పడేసిపోయింది. రాజు దాన్ని తీసి చూస్తూ చిన్నగా నవ్వాడు.

ఆ కాలంలో కళింగ వ్యాపారులు వ్యాపారంకోసం ఓడలలో సరుకులతో సువర్ణ ద్వీపానికి వెళ్ళేవారు. ఆ విధంగా సువర్ణకు వెళుతూన్న వ్యాపారులకు వీడ్కోలు చెప్పడానికి రాజు నదీతీరానికి వచ్చాడు. అక్కడ ఒక పెద్ద ఓడ వర్తకుడికి – సువర్ణ రాజుకు అందజేయమని 'తరకాసి' కానుకను ఇచ్చాడు. వ్యాపారీ, రాజూ మాట్లాడుకుంటూన్నప్పుడు



## కళలు -హస్తకళలు



భారతదేశానికి చెందిన సంప్రదాయ శాస్త్రీయ నాట్యాలలో ఒకటైన ఒడిస్సీ ఒరిస్సా దేవాలయాలలోనే ఆవిర్భవించింది. ఒరిస్సా ఆకర్షణీయమైన హస్తకళలకు కూడా పేరుగాంచింది. వీటిలో 'ఫిలిగ్రీ' అనే వెండి, బంగారాలతోచేసే చిత్రపు పని చాలా ప్రసిద్ధిగాంచింది. చిన్నచిన్న డబ్బీలు, నగలపెట్టెలు, బుట్టలు, పళ్ళాలు మొదలైనవాటిమీద వెండితో లేదా బంగారంతో అందమైన, సునిశితమైన చిత్రపు పనులు చేస్తారు.

ప్రాచీనమైనదీ, విలక్షణమైనదీ అయిన పట్టచిత్ర అనే జానపద చిత్రకళ ఒరిస్సాకు సంబంధించిన హస్తకళ. ప్రత్యేకంగా తయారుచేసిన పలుచటి అట్టలాంటి వాటిమీద జంతువుల, పువ్వుల, దేవతల బొమ్మలు చిత్రీకరిస్తారు.

ఈ రాష్ట్రానికి సంబంధించిన మరొక ప్రత్యేక ఆకర్షణ పిల్పీలో చేసే అప్లిక్ పనులు. రంగు రంగుల వస్త్రాలను అందమైనపువ్వులు, పక్షులు, జంతువుల ఆకారాలలో కత్తిరించి, ఒకబట్టమీద కళాత్మకంగా కుడతారు.

ఓడమీదికివచ్చిన ఉడత హేళనగా ఇలా అన్నది:

''నా ఖజానాను కొల్లగొట్టి,
గొప్పలు పోతున్నాడు రాజు!''

అది విని రాజు తెగ బాధపడిపోయాడు గాని, తన బాధను జనం ముందు వెలిబుచ్చలేదు. కోపంతో పళ్ళు పటపటలాడిస్తూ మౌనంగా ఉండిపోయాడు.

ఆనాటి సాయంకాలం రాజు ఒక విదేశీ దూతతో ఏదో చర్చిస్తూన్న సమయంలో ఉడత అక్కడికి వచ్చి అదే పాటను మళ్ళీ పాడింది.

రాజు అవమాన భారంతో తలెత్తలేక కుంగిపోయాడు. తీరని విచారంతో ఆ రాత్రి రాజుకు కంటిమీద రెప్పవాలలేదు. తెల్లవారగానే వృద్ధ మంత్రిని పిలిపించి, ''మీరెంతో వివేకవంతులు; అనుభవజ్ఞులు. మీరు ఆరోజు అన్నది అక్షరాలా నిజమయింది. నా ఎదుట లేనిపోని గొప్పలు చెప్పుకుంటూన్న ఒక ఉడతను ఆపలేకపోతున్నాను. ఇక మనుషుల సంగతి చెప్పాలా?'' అన్నాడు విచారంగా.

''నిజమే, మహారాజా! ప్రతి ఒక్కరూ తమతమ అహంకారంతోనే ఆలోచిస్తారు, ప్రవర్తిస్తారు. దీనిని అర్థం చేసుకునే వివేకం, అహంభావపూరితులుగాని, అదృష్టవంతులైన ఏ కొందరికో మాత్రమే ఉంటుంది,'' అన్నాడు మంత్రి.

''అయితే, ఇప్పుడు నన్నేం చేయమంటారు? ప్రతి ఒక్కరి ఎదుటా ఆ ఉడత నన్ను దొంగగా నిందించడం అవమానకరంగా ఉన్నది,'' అన్నాడు రాజు బాధగా.

''అన్యథా భావించకండి. తమరు అడిగారుగనక చెబుతున్నాను. ఆ నాణాన్ని

ఉడతకే తిప్పి ఇచ్చేయండి,'' అని సలహా ఇచ్చాడు మంత్రి.

మరునాడు ఆ ఉడత కనిపించగానే, రాజు నాణాన్ని దాని ఎదుట విసిరివేశాడు. ఉడత దాన్ని ఎత్తుకుని సంతోషంగా గెంతుతూ వెళ్ళిపోయింది.

రాజు పీడవిరగడ అయిందని ఊపిరి పీల్చుకున్నాడు. అయితే, ఆ సమస్య అంతటితో తీరలేదు. మరునాడు సభలో ఖాళీగా ఉన్న ఒక ఆసనం మీదికి ఎగిరి కూర్చున్న ఉడత రాజును చూడగానే,

''హడలిపోయిన రాజు
అప్పగించేశాడు నా సొమ్ము.''
అంటూ రాజోద్యానంలోకి వెళ్ళిపోయింది.

దానిని విన్న రాజుకు మతిపోయినంత పనయింది. ఉడత కనిపించినప్పుడల్లా అదే పాటను పాడగలదని ఊహించిన రాజుకు మనశ్శాంతి కరువయింది.



రాజు విచారాన్ని గమనించిన వృద్ధమంత్రి, ఏకాంతంగా ఉన్నప్పుడు ఆయన్ను సమీపించి, ''ప్రభూ, ఆ అల్పప్రాణిని చూసి నవ్వుకోండి. అంతేగాని ఆగ్రహించకండి. అదంటే తమకు నిజంగానే భయం అని చెప్పండి. ఆ తరవాత ఏం జరుగుతుందో చూడండి,'' అన్నాడు.

మరునాడు ఎప్పటిలా ఉడత సభకు రాగానే రాజు నవ్వుతూ ఇలా అన్నాడు:

''మహాశక్తియుక్తులుగల ఉడత రాజమా!
నీ గొప్పదనం అనన్యం, చరిత్ర ఉదాత్తం!
సవినయంగా వేడుకునే ఈ సగటు రాజు మీద
దొడ్డమనసుతో కొంచెం కరుణ చూపుమా!''

ఉడత ఇలా జరుగుతుందని అనుకోలేదు. ఒక్క క్షణం మౌనంగా ఊరుకున్నది. మరుక్షణం ఆనందంతో నాట్యం చేసింది. పిమ్మట సంతోషంగా గెంతుతూ ఉద్యానవనంలోకి వెళ్ళిపోయింది. ఆ తరవాత అదెన్నడూ రాజుకంట పడలేదు.

''ప్రభూ! చాలావరకు మనుషులందరూ ఈ ఉడత మనస్తత్వం కలిగినవాళ్ళే. ప్రపంచంలోని ప్రతిదాన్నీ తమ స్వల్ప అవగాహనతో, మిడిమిడి జ్ఞానంతో వ్యాఖ్యానిస్తారు.మనం తొణకని మనసుతో వాళ్ళను ఉపేక్షిస్తే చాలు. అశాంతి, బాధల నుంచి చాలావరకు దూరంగా ఉండవచ్చు,'' అన్నాడు మంత్రి రాజుతో.

''నిజం, మంత్రివర్యా! నా ఎదుట ఎవరూ గొప్పలు చెప్పలేరని మూర్ఖంగా భావించాను. మొదట నేను వినయాన్ని అలవరచుకోవాలి. నా కళ్ళు తెరిపించారు, కృతజ్ఞతలు!'' అన్నాడు రాజు మందహాసంతో.



# రెండు పడవలపై కాళ్ళు!

భువనగిరి రాజ్యాన్ని రవివర్మ పాలించే రోజుల్లో, రంగనాథం అనే ఆయుర్వేద వైద్యుడుండేవాడు. ఆయన వైద్యంతోపాటు చిత్రలేఖనంలో కూడా మంచి ప్రజ్ఞాపాటవాలు కలవాడు. ఏ మనిషినైనా ఒకసారి చూస్తే చాలు, అతడి రూపురేఖల్ని ఏమాత్రం తేడాలేకుండా ఇట్టే చిత్రించగలడు.

ఒకరోజు అర్ధరాత్రి దాటినతర్వాత, ఎవరో ఇద్దరు వ్యక్తులు ఆయన ఇంటి తలుపు తట్టారు. రంగనాథం లేచివచ్చి, తలుపు తెరిచి, ''ఎవరు మీరు?'' అంటూ వారిని గద్దించి అడిగాడు.

వారిలో ఒకడు, ''అయ్యా, మాది పొరుగూరు. వ్యాపారనిమిత్తం ఈ ఊరు వచ్చాం. దొంగలు మా దగ్గరున్నదంతా దోచుకున్నారు. చేసేదిలేక కాలినడకన వెళుతున్నాం. చీకటిలో కనపడక, మావాడు కుక్క తోక తొక్కాడు. అది కరిచింది. మీరిక్కడ మంచి వైద్యులని తెలిసి, గాయానికి కట్టుకడతారేమో అని వచ్చాం,'' అన్నాడు.

అతడి వెంటవున్నవాడి మోకాలి కింద రక్తం కారుతున్న గాయం వున్నది. రంగనాథం దానికి ఏదో తైలం రాసి కట్టుకట్టాడు. వాళ్ళాయనకు కృతజ్ఞతగా నమస్కరించి హడావుడిగా వెళ్ళిపోయారు.

ఐతే, రంగనాథం ఇదంతా జరుగుతున్నంతసేపూ, వాళ్ళ ముఖాల్లో ఎక్కడలేని భయాందోళనలను గమనించాడు. వాళ్ళెక్కడైనా ఏదైనా నేరం చేసి పారిపోతూ ఇటు వచ్చారా, అన్న అనుమానం ఆయనకు కలిగింది. అందువల్ల, వాళ్ళు వెళ్ళిపోగానే, వాళ్ళిద్దరి ముఖాలనూ అప్పటికప్పుడు చిత్రించి, బల్ల సొరుగులో దాచాడు.

ఆ మర్నాటి ఉదయం ఆయనకు అసలు సంగతి రాజభటుల చాటింపుద్వారా తెలిసింది. రాత్రి రాజు రవివర్మపైన హత్యాప్రయత్నం జరిగింది. అర్ధరాత్రివేళ, ఆయన శయ్యామందిరం వైపు చురకత్తులు చేతబట్టి నక్కినక్కి వెళుతున్న ఇద్దరిని, కాపలాభటులు ప్రాణాలతో పట్టుకోవాలని చూశారు. కానీ, వాళ్ళు వెను

మన్నవ మారుతీప్రసాద్

దిరిగి ప్రాకారం గోడదూకి తప్పించుకుని పారిపోయారు.

రంగనాధం, రాత్రి తన దగ్గరకు వైద్యం కోసం వచ్చినవాళ్ళ ముఖచిత్రాలను, నగర పాలకుడివద్దకు తీసుకుపోయి జరిగింది చెప్పాడు.

సులభంగా వాటి ఆధారంగా నగరపాలకుడు నేరస్థులను వెతికి పట్టుకున్నాడు.

రాజు విచారణ జరిపి, ఆ ఇద్దరికీ మరణ శిక్ష విధించి, ఈ నేరపరిశోధనకు తోడ్పడిన చిత్రాలు గీసిన రంగనాధాన్ని ఘనంగా సత్కరించాడు.

ఈ సత్కారంతో రంగనాధం పేరు రాజ్యంలో నలుమూలలా వ్యాపించింది. దానితో ఆయనకు చిత్రకళపై ఆసక్తి మరింతగా పెరిగింది. రోజూ ఎక్కువకాలాన్ని బొమ్మలు గీస్తూ గడపసాగాడు. ఇది, మెల్లమెల్లగా ఆయన వైద్య వృత్తికి ఆటంకంగా పరిణమించింది. చిత్రాలు గీయడంలో నిమగ్నుడై ఉండడంవల్ల ఒక్కొక్కసారి తీవ్రవ్యాధులతో వచ్చిన రోగులను కూడా ఆయన శ్రద్ధగా చూసేవాడు కాదు. ఈ కారణం వల్లక్రమంగా ప్రజల దృష్టిలో ఆయనవైద్యుడన్నగుర్తింపు సన్నగిల్లింది.

ఇలాంటి పరిస్థితుల్లో, వరసగా రెండు సంవత్సరాలు తగిన వర్షాలు లేక ఇరుగు పొరుగు రాజ్యాల్లో కరువుకాటకాలు ఏర్పడ్డాయి. భువనగిరి రాజ్యం మీదుగా ఒక జీవనది పారుతూండడం వల్ల, రాజ్యంలో కరువు పరిస్థితులేర్పడలేదు. అందువల్ల పొరుగు రాజ్యాల నుంచి భువనగిరికి ప్రజలు వలస రాసాగారు.



అలా వచ్చినవారిలో, విశ్వకేతు అనే నడివయస్కుడైన వైద్యుడొకడున్నాడు. ఆయన రంగనాధాన్ని లోగడ ఒకసారి చూశాడు, మంచి వైద్యుడని కూడా తెలుసు. కాని, ఇప్పుడు వెతుక్కుంటూ వెళ్ళి విచారించగా, ఆయన చిత్రకళమత్తులో వున్నాడనీ, ఎప్పుడు చూసినా చిత్రాలు గీస్తూ ఉండడం వల్ల రోగులు రావడం కూడా పూర్తిగా తగ్గిపోయిందనీ తెలియవచ్చింది.

విశ్వకేతు, నగరం శివార్లలో ఒక పెద్ద పెంకుటిల్లు అద్దెకు తీసుకుని, అందులో తన వైద్య వృత్తి ప్రారంభించాడు. రంగనాధంతో విసిగిపోయిన ప్రజలు వైద్యం కోసం అతడి దగ్గరకు రాసాగారు. విశ్వకేతు రెండు చేతులా సంపాదించసాగాడు.

కాలం గడిచినకొద్దీ, ఇదివరలో సంపాదించినదంతా ఖర్చయిపోవడంతో, రంగనా



ధానికి రోజులు గడవడం కూడా ఎంతో కష్టంగా తయారైంది. సంసారం పెద్దదికావడం వల్ల ఎలా మనుగడసాగించాలో తెలియని అయోమయస్థితిలో రంగనాధం - పొరుగూరులో వున్న తన మేనమామను సలహా అడిగేందుకు, ఒకనాడు తెల్లవారుజామునే నిద్రలేచి బయ ల్దేరాడు.

రంగనాధం నగరం శివార్లు దాటుతూండగా, అతడికి ఒక వీధి చివరన పాతకాలపు పెద్ద పెంకుటిల్లొకటి కంటబడింది. ఆ ఇంటి దాపుల నుంచి నాదస్వర సంగీతం వినిపించింది. లోగడ వాళ్ళూ వీళ్ళూ చెప్పగా విన్నదాన్నిబట్టి, ఆ ఇల్లు కొత్తగా వచ్చి స్థిరపడిన వైద్యుడు విశ్వకేతుదని, ఆయన గ్రహించాడు. ఆ ఇంటి వసారాలో కూర్చుని, ఒక వ్యక్తి చక్కగా నాద స్వరం వాయిస్తున్నాడు.

రంగనాధం ఇంటిని సమీపించేసరికి, నాదస్వరం వాయిస్తున్న వ్యక్తి లేచి నిలబడి, ''మీరిలా వచ్చారేమిటి?'' అని గౌరవంతో నమస్కరించి, కూర్చునేందుకు పక్కనే ఉన్న ఆసనం చూపాడు. ఆయన కూర్చున్నాక ''అయ్యా, మిమ్మల్ని నేనెరుగుదును; నన్ను తమరెరిగే అవకాశం లేదు. పొరుగురాజ్యం వాణ్ణి. నా పేరు విశ్వకేతు, వైద్యంలో మీకేమా త్రంసాటిరాను. మాప్రాంతాల ఏర్పడిన కరు వుకాటకాలవలన, ఇలా వలసవచ్చి స్థిర పడ్డాను,'' అంటూ తనను తాను పరిచయం చేసుకున్నాడు.

తనను గుర్తించి గౌరవించినందుకు రంగ నాధం సంతోషిస్తూ, ''మీరు నాదస్వరాన్ని అద్భుతంగా వాయించగలరు!'' అన్నాడు మెచ్చుకోలుగా.

విశ్వకేతు చిరునవ్వు నవ్వి, ''అయ్యా, చిన్నతనం నుంచీ నేను నాదస్వరం అభ్యసించాను. కాని వృత్తిరీత్యా వైద్యం చేసేవాణ్ణి. వైద్యం ద్వారానే పేరూ, డబ్బూ సంపాయించాను. కానీ నడమంత్రపు సిరిలా ఒకదశలో నాకు నాదస్వరంలో మంచి విద్వాంసుడిగా పేరొచ్చింది, రాజ సన్మానం కూడా పొందాను. దాంతో వైద్యంపై మెల్లమెల్లగా శ్రద్ధ తగ్గింది. అప్పుడప్పుడూ నాదస్వరం కచేరీలకు పోయేవాణ్ణి. క్రమంగా జనం వైద్యం కోసం నాదగ్గరకు రావడం మానేశారు. కచేరీలు ఎల్లకాలం వుండవని తర్వాత తెలుసుకున్నా కానీ, చాలా ఆలస్యంగా, అనుకోండి!'' అన్నాడు.

''బావుంది! తర్వాత ఏం చేశారు?'' అని అడిగాడు రంగనాథం కుతూహలంగా.

''బ్రతుకుతెరువు కోసం చేపట్టిన వృత్తి వేరు, ఆత్మతృప్తి కోసం అలవరుచుకున్న అభిరుచులూ, వ్యాపకాలూ వేరు అన్న సత్యం తెలుసుకున్నాను. ఆ తర్వాత నేనెవరో తెలియని ఈ రాజ్యానికి వలసవచ్చి, నే నేర్చిన వైద్యవృత్తిని నమ్ముకుని జీవనం సాగిస్తున్నాను. ఎప్పుడైనా ఆహ్లాదం కోసం ఇలా ఏ అర్ధరాత్రో అపరాత్రో కాసేపు నాదస్వరం ఆలపిస్తూంటాను,'' అంటూ తన కథ ముగించాడు విశ్వకేతు.

విశ్వకేతు కథ అంతా తన కథలాగే వుండడంతో రంగనాథం తృప్తిగా తలాడించి, ''నా కంటే చిన్నవాడివయినా, అతి త్వరలో అనుభవసారాన్ని కూలంకషంగా వెలగట్టగలిగావు. రెండు పడవలపై కాళ్ళుపెడితే, ప్రమాదం పాలు కావడం తప్ప ప్రయాణం సాగదు. అందుకే నేను పతనావస్థను చేరాను. నీలాగే నేనూ ఏదైనా కొత్తప్రాంతానికి వెళ్ళి, నాకు తెలిసిన వైద్యవృత్తికి అంకితమవుతాను,'' అన్నాడు.

''మీకు లోగడే ఇక్కడ మంచి వైద్యుడన్న పేరున్నది. ఇప్పుడు నామీదా ఈ ఊరివాళ్ళకు గురి కుదిరింది. మనమిద్దరం కలిసి ఈ ఊళ్లోనే వైద్యవృత్తిని ఆరంభిస్తే, మన జీవితాలు ఒడిదుడుకులు లేకుండా సాగిపోతాయి. ఉన్న ఊరు వదిలి ఎక్కడికో వెళ్ళవలసిన అవసరం లేదు కదా!'' అన్నాడు విశ్వకేతు.

రంగనాథం అందుకు సమ్మతించాడు. ఆ తరవాత ఇద్దరూ కలిసి అక్కడే వైద్యం చేస్తూ, కొద్ది రోజులలోనే ప్రజల ఆదరాభిమానాలకు పాత్రులయ్యారు.



# మనదేశం గురించి తెలుసుకుందాం

**1.** మకరసంక్రాంతిని ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క విధంగా జరుపుకుంటారు. జత కలపండి చూద్దాం.

ఎ) గాలిపటాలు ఎగురవేస్తారు. — i) తమిళనాడు

బి) పొంగళ్ళు పెడతారు. — ii) కేరళ

సి) కొండమీది గుడికి యాత్ర చేస్తారు. — iii) గుజరాత్

**2.** పురాణకాలం నాటి ఈ రాజు యేటా తన రాజ్యానికి తిరిగి రావడాన్ని పురస్కరించుకుని పది రోజుల పాటు పండగ జరుపుకుంటారు. ఆ రాజు ఎవరు?

ఎ) ధర్మరాజు
బి) శ్రీరాముడు
సి) మహాబలి



**3.** ఒక పండుగను సామూహిక ఉత్సవంగా జరుపుకోవాలని ఆదేశించి తద్వారా సాధారణ ప్రజలలో దేశభక్తిని ప్రేరేపించిన నాయకుడి చిత్రం ఇది. ఆ జాతీయ నాయకుడి పేరేమిటి? పండుగ ఏది?

**4.** జనం చాలా సంతోషంగా ఉన్నారు. అందులో సందేహం లేదు. అయితే, ఈ చిత్రంలో ఒక అసంబద్ధత ఉంది. అదేమిటో చెప్పగలరా!



**5.** ప్రవక్త మహమ్మద్ కుమారుడు హుస్సేన్ ప్రాణత్యాగాన్ని కొందరు ముస్లింలు యేటా జరుపుకుంటారు. అదేమిటి?

ఎ) రంజాన్
బి) ఈద్-ఉల్-జువా
సి) ఈద్-ఉల్-ఫితర్

(సమాధానాలు వచ్చే సంచికలో)

## జూలై క్విజ్ సమాధానాలు

1. బృహస్పతి.
2. ఆర్యభట.
3. వ్యవసాయం.
4. మదన్‌మోహన్ మాలవ్యా, కాశీ హిందూవిశ్వవిద్యాలయం.
5. రూర్కీ విశ్వవిద్యాలయం.
6. డా. ఎల్.కె. అనంతకృష్ణ అయ్యర్.



# విఘ్నేశ్వరుడు

గజాననపండితుడి ఇంట కామధేనువులాంటి గంగిగోవు ఉన్నది. నందుడు అనేవాడు దాని బాధ్యతలు నిర్వహిస్తూ, గజానన పండితుడికి రోజూ చిక్కటి పాలు పితికి తెచ్చి ఇచ్చేవాడు. ఒకనాడు స్వరకేసరి నందుణ్ణి మంచిగా లోబర్చుకొని, వాడు చెయ్యవలసినదంతా నూరిపోశాడు.

గణపతి నవరాత్రి ఉత్సవాలకు కుమార్తెనూ, అల్లుణ్ణీ, మనుమడు గణేశభట్టునూ తీసుకురావడానికి దగ్గరలోనే ఉన్న కళ్యాణి నగరానికి గజాననుడి భార్య రెండు రోజుల క్రితమే వెళ్ళి ఉన్నది.

గజాననుడి అమరగానాన్ని విని తరించడానికి దూరదూరాల నుంచి రసజ్ఞులైన శ్రోతలు తండోపతండాలుగా వాతాపినగరానికి చేరుకొంటున్నారు. ఆనాడే ప్రారంభ దినం. వాతాపిగణపతి ఆలయ ప్రాంగణంలో గజాననుడు తొలిపాట వినిపించవలసిన రోజు, వినాయక చతుర్థి!

వేకువనే నందుడు స్వరకేసరి చెప్పిన ప్రకారంగా లోటాలో ఉన్న నీళ్ళలో పితికి తెచ్చిన పాలు కొన్ని పోసి, లోటాను అలాగే తీసుకెళ్ళి గజాననుడికి ఇచ్చాడు.

గజాననుడు లోటాలోని నీళ్ళపాలను జూసి నివ్వెరపడి, ''ఇదేమిటి నందా! ఎన్నడూ లేంది ఈరోజు పాలలో నీళ్ళుపోసి తెచ్చావేమిటీ?'' అని అడిగాడు.

వెంటనే నందుడు, ''ఆ గణేశుడి సాక్షి! నేను పాలల్లో నీళ్ళు పోసి తేలేదు, ప్రమాణం చేసిచెపుతా!'' అని బోరవిరుచుకుని అరిచాడు.

గజానన పండితుడి దగ్గర వినయంగా ఉండే నందుడు, అంత నిర్భయంగా అరవడం చూసి ఆశ్చర్యపడుతూ వీధిలోని వాళ్ళు నలుగురూ వచ్చి మూగారు. వీధిని పోతూన్న

వాడల్లే వెళ్తూన్న స్వరకేసరి ఆగి దూరంగా నిలబడిపోయి లోలోపల ముసిముసిగా నవ్వుకొంటూ చూడసాగాడు.

గజాననపండితుడు చిరుకోపంతో కనుబొమలు ముడిచి, “నందా! ప్రమాణందాకా వచ్చావూ? ఏదీ ప్రమాణం చెయ్యి చూద్దాం!” అని అన్నాడు.

ప్రమాణం చేయవలసివచ్చేసరికి జంకు పుట్టి నందుడు తటపటాయిస్తూంటే, “అలా దిక్కులు చూస్తావేం?” అంటూ గజాననపండితుడు కంచుఘంటలాంటి కంఠధ్వనితో, “ప్రమాణం చెయ్యవేం మరి?” అని గద్దించగా నందుడికి మరింత దిగులు పట్టుకొంది.

దూరంగా ఉన్న స్వరకేసరి పెద్దమనిషి లాగ వేగంగా ముందుకు వచ్చి, “అనగానే సంబరమా, చెయ్యరా నందా చెయ్యి! చెప్పింది సరిగ్గా చెప్పి, దీపం ఆర్పు, భయపడతావెందుకు!” అంటూ నిబ్బరం చెప్తూన్నట్టు కనుసైగ చేశాడు. నందుడు సగం ధైర్యం తెచ్చుకొని, ఎదురుగా గదిలో స్వర్ణగణేశ ప్రతిమదగ్గిర వెలుగుతున్న దీపం ముందుకెళ్ళి నిల్చుని, భయం భయంగా హీన స్వరంతో, “నేనేగాని పాలల్లో నీళ్ళుపోసి తెస్తే, నా రెండు చేతులూ పడిపోవాలి! లేదా అలాగ అన్న గొంతుకే పడిపోవాలి!” అని చెబుతూ, దీపం ఆర్పేస్తూ గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

గజాననుడు దిగ్భ్రాంతితో కొయ్యబారిపోయాడు. అతని గొంతు బిగుసుకుపోయి మాట రాలేదు.

“అయ్యో! ఎంతపని జరిగింది!” అని నలుగురూ విచారిస్తూంటే, “ప్రమాణకాలు చేయించడం అంటే మాటలా మరి!” అని అంటున్న స్వరకేసరి గొంతు విని నందుడు కళ్ళు తెరిచి, తన చేతులకేమీ కానందుకు ఆనందపడుతూ, గబగబా స్వరకేసరిని చేరుకున్నాడు.

ఆ సమయంలో బాలగణేశభట్టు పరుగెత్తుకుంటూ వచ్చి, “తాతయ్యా! బండి దిగి ముందు నేను పరుగెత్తుకుంటూ వచ్చేశా! అమ్మమ్మావాళ్ళంతా బండిమీద వస్తున్నారు!” అని అంటూ తాతగారిని చూసి నివ్వెరబోతూ, నలుగురూ చెప్పినదంతా విని, పెదవులు బిగించి నడుం మీద చేతులుంచి ధాటిగా నిలబడి, “నందా, ఆగు!” అన్నాడు.

స్వరకేసరితో వెళ్ళిపోబోతూన్న నందుడు మంత్రించినట్టుగా ఠక్కున ఆగిపోయి, గదిలో దీపం వెలుగుతూనే ఉండడం చూసి విస్తుపోయాడు.

''నువ్వు దీపం సరిగా ఆర్పినట్టులేదు, మళ్ళీ ప్రమాణం చెయ్యి!'' అని శాసిస్తున్నట్టు బాలభట్టు అన్నాడు.

భయం లేదు వెళ్ళి ప్రమాణం చెయ్యి అన్నట్లుగా స్వరకేసరి నందుడి వీపు పొడిచి ముందుకు తోశాడు.

బాలగణేశభట్టు, ''నందా! సరిగ్గా విను, నేనేగాని నీళ్ళల్లో పాలు పోసి ఇస్తే, నా చేతులు పడిపోవాలి! అని చెప్పి దీపం ఆర్పు! ఊ, త్వరగా కానియ్యి,'' అని హుంకరిస్తూ అన్నాడు.

నందుడికి ముచ్చెమటలు పోశాయి. అతడు గజగజలాడుతూ, ''అయ్యబాబో! నేనీ ప్రమాణకం చెయ్యను. ఈ స్వరకేసరి చెప్పినట్లుగా, నీళ్ళలో పాలు పోసి తెచ్చి చ్చాను. పాలల్లో నీళ్ళు పోయలేదని ప్రమాణంచేశాను. అంతే! నన్ను రక్షించండి!'' అని అంటూనే గబగబా వెళ్ళి, నీళ్ళల్లో పోయగా చెంబులో మిగిలి ఉన్న చిక్కటి పాలను తెచ్చి బాలభట్టు ముందుపెట్టి అలాగే మోకరిల్లుతున్నట్లు పడ్డాడు.

అక్కడ చేరినవారంతా గలగలా నవ్వుతూన్న కోలాహలంలో స్వరకేసరి జాడలేకుండా పారిపోయాడు. అతని కోసం కొందరు పరుగున వెళ్ళారు.

అప్పుడు గణేశభట్టు నలుగుర్నీ కలియజూసి, ''చూశారా! ఈ ప్రమాణకాలు చేసేవారూ, వెనుకదన్నుగా చేయించేవారూ ఎక్కువమంది వట్టి మాయావులు! మాటలు మారుస్తూ సత్యాన్నే తికమకపెట్టే ద్రోహులు. అమాయకుల్ని నమ్మించి మోసం చేసే వంచకులు!'' అని అన్నాడు.



''ఔను! చిన్నవాడివైనా బాగా చెప్పావు. కళ్ళు తెరిపించావు!'' అని కుర్రవాడి తెలివితేటల్ని మెచ్చుకుంటూ, గజానన పండితుడి గొంతుపట్టు విడిపోయినట్లు తెలుసుకొని, అంతా సంతోషిస్తూ వెళ్ళిపోయారు.

గణేశభట్టు, ''తాతయ్యా! ఆడంబరమూ, అహంకారమూ లేని పండితుడివైన నువ్వే పామరుడిలాగ, ఇలాంటి ప్రమాణాల మాయలో పడ్డావంటే చాలా చిత్రంగా ఉంది కదా!'' అన్నాడు.

గజాననుడు బాలుణ్ణి దగ్గరకు తీసుకుని కన్నులు మూసి, ''ఔను, గణేశా!'' అని అంటూన్న సమయంలో వీధిలో బండి ఆగింది.

గజాననుడు కళ్ళు తెరిచి చూస్తే బాలుడు లేడు; అప్పుడే బండి మీంచి కిందికి గణేశభట్టు దూకడం కనిపించింది.



గజానన పండితుడి ముఖం ఒక్క క్షణం జ్యోతిలాగ వెలిగింది. ''గణేశా!'' అంటూ మహానందంతో ఆనందభైరవి ప్రారంభ స్వరంలాగ అరిచాడు.

పావనమిశ్రుడు కథ చెప్పడం ఆపి, ''పిల్లలూ! ముందు వచ్చిన ఆ గణేశభట్టు ఎవరో చెప్పండి?'' అని అనడమే తరవాయిగా, ''ఇంకెవరు, మన విఘ్నేశ్వరుడే! వాతాపి గణపతి,'' అంటూ పిల్లలూ, వారితో పెద్దలూ గొంతులు కలిపారు. పావనమిశ్రుడు తిరిగి చెప్పసాగాడు:

''తాతా!'' అంటూ గణేశభట్టు చేతులు చాచి పరుగున వస్తూంటే, ''గణేశా!'' అంటూ పండితుడు చేతులు చాచి మనవణ్ణి ఎత్తి, ''గణేశా! విఘ్నేశ్వరుడు మనల్ని అనుగ్రహించాడు. నీ రూపంలో వచ్చి మన ఇల్లు పావనం చేశాడు. ఇది గజానన మందిరం!'' అని ఆనందపారవశ్యంతో అంటూ అరవై ఏళ్ళు నిండిన ఆ వయస్సులో చిన్నపిల్లవాడిలాగ గంతులేస్తూ, ''తాండవ నృత్యకరీ గజానన ధిమికిట...'' అంటూ ఆనందభైరవి రాగంలో సమ్మోహన గాత్రంతో పాడుతున్న పాట ఘంటానాదంలాగ నగరమంతటా మార్మోగుతూ వినిపించింది.

ఆ ఆనందపతాక సన్నివేశంలో స్వరకేసరి పరుగున వచ్చి, గజానన పండితుడి పాదాలు చుట్టివేసి తల అన్చి, ''గురుదేవా! క్షమించాను అని అంటేగాని మీ పాదాలు వదలను!'' అని అన్నాడు.

గజాననుడు తెప్పరిల్లి, స్వరకేసరిని లేవనెత్తి, ''స్వరకేసరీ! మనం నిమిత్తమాత్రులం, అంతా ఆ గజాననుడి లీలావిలాసం! నువ్వు సంగీతాన్ని శాస్త్రీయంగా మథించినవాడివి. నేను భక్తికి, మమతకు ప్రాధాన్యం ఇచ్చి, భక్తితో కూడినప్పుడే సంగీతం ఉన్నతమార్గం అందుకుంటుందని నమ్మినవాణ్ణి, అంతే! ఇకనుంచి స్వర్ణగణేశ విగ్రహాలు అన్నీ నీ అధీనమే! ఆ సత్కారాలేవీ నాకు వద్దు. ఇటుపైని నేను సభల్లో పాడను!'' అని అనగానే గణేశభట్టు, ''తాతయ్యా! నీకోసం నువ్వు ఇంట్లో పాడుకొంటే చాలదు. ఎదుటివారిలో మంచి అభిరుచినో, ఆనందాన్నో, మమతనో, భక్తినో కలిగించినప్పుడేకదా నీ పాటకూ, పాండిత్యానికీ సార్థకత!'' అన్నాడు.

గజాననుడు చేతులెత్తి జోడిస్తూ, ''ఓ విఘ్నేశా! ఈ మాటలు నా మనవడి నోటితో నువ్వే అంటున్నావు! ఇంతవరకూ నీవు చెప్పినట్టుగానే గానం వినిపించాను. ఇక ముందు కూడా నీ ఆనతిప్రకారం అలాగే నిన్ను కీర్తిస్తాను.

వినేవారి హృదయాల్లో నర్తించు! సత్కారాలు మాత్రం నాకు అందకుండా చూడు!'' అన్నాడు.

అప్పుడు స్వరకేసరి, ''గురుదేవా! మీరు రచించిన కీర్తనలను మీ రీతిలో పాడినవారికి ఏటేటా స్వర్ణగణేశ విగ్రహం బహూకరింప బడుతుంది; ఆ విధంగానైనా మా భక్తిగౌరవాల్ని మీపట్ల చూపుకోగల అదృష్టాన్ని అనుగ్రహిం చండి!'' అని అంజలిఘటించి అర్థించాడు.

గజానన పండితుడికి అరవై ఏళ్ళు పూర్తి అయిన సందర్భంగా, అతను వద్దంటున్నా ఆనాటిసాయంకాలం వాతాపిగణపతి ఆలయ ప్రాంగణంలో ఏర్పాటైన బ్రహ్మాండమైన మహాసభలో పూలజల్లుల మధ్య షష్టిపూర్తి మహోత్సవం వైభవంగా జరిగింది. గజానన పండితుడు చేతులు జోడించి, ''ఎందరో మహానుభావులు సంగీతాన్నీ, కవిత్వాన్నీ భక్తికి అంకితం చేసి అదే సన్మార్గమని చెప్పారు! వారందరికీ వందనాలు. నేనూ అదే నమ్మాను. అంతకంటే నాలో మరే విశేషమూ లేదు!'' అని చెప్పి, అనేక రాగమాలికలతో, విఘ్నేశ్వ రుణ్ణి కీర్తిస్తూ అమృతగానాన్ని వినిపించాడు. ఆనాటి శ్రోతల హృదయాల్లో తాండవించిన విఘ్నేశ్వరుడు ఎప్పటికీ అలాగే నర్తిస్తూ ఉండిపోయాడు.

ఈవిధంగా వాతాపినగర చరిత్రలో గజా ననపండితుడి పేరు సువర్ణాక్షరాలతో నిలిచి పోయింది, అని పాపమిశ్రుడు ముగించాడు.

ఒకనాడు చాలామంది పిల్లలు వారి వెనుక పెద్దలు గుమిగూడి ఒక చిత్రాన్ని వింతగా చూస్తున్నారు. ఆ చిత్తరువులో ఒక విచిత్రమైన జంతుభూతం చిత్రించబడి ఉంది. అప్పుడే



మంటపంలోకి ప్రవేశిస్తున్న పావనమిశ్రుడు పిల్లల కుతూహల కారణం గ్రహించి, ''పిల్లలూ! కథ విందురుగాని కోర్చోండి!'' అంటూ చెప్ప మొదలుపెట్టాడు:

ఇంద్రుడు సగరచక్రవర్తి యాగాశ్వాన్ని దాచాడు. పృథుచక్రవర్తి యాగం సరిగ్గా పూర్తవకుండా, గుర్రాన్ని దొంగిలించుకుపోతూ పాషండ వేషాలు వేశాడు, చేయరాని పనులెన్నో చేశాడు.

పృథుచక్రవర్తి సంతతివాడైన అభినందనుడనే మహారాజు ఇంద్రుడికి భాగం లేకుండా ఉండే ఒక మహాయాగాన్ని ప్రారంభించాడు. ఇంద్రుడు పట్టరాని ఉక్రోషంతో కాలుడిని ఇచ్చకాలతో, సురభోగాలతో బాగా తృప్తి పరిచి, అభినందనుడి యాగాన్ని ధ్వంసం చేయమని కోరాడు.

కాలుడు కాలానికి అధినేత, జీవుల జీవన మరణాలకు కాలుడే మూలము. కాలుణ్ణి కాలయముడు, కాలధర్ముడు అని కూడా అంటారు.

కాలుడు యజ్ఞపురుషుణ్ణి ఆవహించి, అభినందనుడి యాగ హోమాగ్ని నుండి కనీ వినీ ఎరుగని మహాభయంకరమైన పర్వతంలాంటి జంతుభూతం వెలువడేలాగ చేశాడు. ఋత్విజులు, అధ్వర్యులు మొదలైన వారంతా పారిపోయారు.

అభినందనుడు గణేశభక్తుడు. అతని గురువైన వశిష్ఠుడు, ''రాజా! ఇలాంటి అవాంతరం రావచ్చునని తెలిసే హోమగుండానికి ఎదురుగా పెద్ద స్వస్తికాపీఠాన్ని వేయించాను. స్వస్తిక గణేశుని సంకేత చిహ్నం. గణేశ్వరునికి ప్రతిరూపంగా పసుపుముద్దను స్వస్తిక కేంద్రంలో పెట్టి ప్రణమిల్లు! ఆ స్వస్తిక అవాంతరాన్ని నిర్మూలిస్తుంది!'' అని చెప్పాడు.

రాజు అలాగే చేశాడు.

ఆ స్వస్తిక ముగ్గు కేంద్రం నుంచి అద్భుత ప్రకంపనంతో నాదం వెలువడి, అణువులు విజృంభించి పైకెగిసి మహాజంతుభూతాన్ని ఆవరించాయి. అణువులు పెద్దవిగా పెరుగుతూ ఎలుకలుగా మారాయి. అనేక రంగు రంగుల్లో మెరిసిపోతూన్న చిట్టెలుకలు చీమల బారుల్లాగ భూతజంతువు నిండా పట్టుకొని కొరికి కొరికి, బలవంతమైన సర్పము చలి చీమలచేత చిక్కి చచ్చిన విధంగా చేసినై. భూతజంతువు గిలగిలా తన్నుకొని చచ్చినట్లు చచ్చి అదృశ్యమైంది.





# ఇద్దరు దేవతలు

పూర్వం సత్యకీర్తి అనే యువకుడు ఉండే వాడు. అతని తల్లితండ్రులు చిన్నతనంలోనే పోతే, అవ్వ ఎంతో కష్టపడి పెంచి పెద్దచేసింది.

కొంతకాలానికి ఆమె ఏదో అంతుబట్టని వ్యాధితో మంచంపట్టి, చనిపోతూ రెండు బొమ్మలు అతనికి ఇచ్చి, "నాయనా, ఈ ఇద్దరూ దేవతలు. వీళ్ళను శ్రద్ధగా పూజిస్తే నీకు శుభం కలగవచ్చు," అన్నది.

అవ్వ పోయినాక సత్యకీర్తి ఏ పనీ చేత కాక తిండికి కూడా లేక ఎటైనా పోదామని బయలుదేరాడు.

పోగాపోగా ఒక అడవి వచ్చింది. ఆ అడవిలో ఒక ఇల్లు కనిపించింది. వాడు ఆ ఇంట్లో ఉన్న ఆడమనిషిని, "నాకు తిండికిఇబ్బంది లేకుండా ఉండేచోటు కావాలి. అక్కడకూర్చుని ఈ రెండు బొమ్మలకూ పూజచేసుకుంటాను," అన్నాడు.

ఆ ఆడమనిషి నవ్వి, "ఇలా తూరుపు దిశగా ఇంకా కొంతదూరం ముందుకు పోతే ఒక మిట్ట వస్తుంది. అక్కడ రకరకాల పళ్ళ చెట్లు చాలా ఉన్నాయి. ఒక పాడుపడిన ఇల్లు కూడా ఉన్నది. అక్కడ నీ బొమ్మలను పూజ చేసుకుంటూ, ఎంతకాలమైనా హాయిగా పళ్ళు తిని బతకవచ్చు. నీకెవరూ ఆటంకం కలిగించరు," అన్నది.

సత్యకీర్తి మిట్టను చేరుకున్నాడు. ఆ ఆడది చెప్పినట్టే అక్కడ ఒక పాడుపడిన ఇల్లూ, దానిచుట్టూ రకరకాల పళ్ళచెట్లూ ఉన్నాయి. వాడు ఆ ఇంట్లో ప్రవేశించి, చెట్ల పళ్ళు తింటూ అవ్వ ఇచ్చిన బొమ్మలను పూజించసాగాడు.

కొన్నాళ్ళకు ఒక దేవత ప్రత్యక్షమై, "నీ పూజకు సంతోషించాను. నీకు ఏమివరం కావాలో కోరుకో," అన్నది.

"అమ్మా, నువ్వు ఏ దేవతవు?" అని సత్యకీర్తి అడిగాడు.

"నేను స్వార్థదేవతను. నువ్వు నన్ను వరం కోరితే అందులో స్వార్థం ఉండాలి. అప్పుడే



అది సిద్ధిస్తుంది. ఆ సంగతి మరిచిపోకు,'' అన్నది ఆ దేవత.

''అమ్మా, నువ్వు తలవని తలంపుగా కనిపించావు. ఇంత త్వరగా ప్రత్యక్షమవు తావని అనుకోలేదు. అందుచేత నేను ఏం వరం కోరాలో ఆలోచించలేదు. దయచేసి రేపు మళ్ళీ కనిపించి, నేను కోరేవరం ఇయ్యి,'' అన్నాడు సత్యకీర్తి.

స్వార్థదేవత సరేనని అంతర్థానమయింది.

స్వార్థం అంటే ఏమిటో సత్యకీర్తికి అర్థం కాలేదు. వాడు వెంటనే అక్కడి నుంచి బయలుదేరి అడవిలో ఉంటున్న స్త్రీ వద్దకు వెళ్ళి, స్వార్థదేవత ప్రత్యక్షం కావటం చెప్పి, ''స్వార్థమంటే ఏమిటి?'' అని అడిగాడు.

''తరవాత చెబుతానుగాని ముందు లోపలికిరా,'' అంటూ ఆమె సత్యకీర్తికి భోజనంపెట్టింది. ఆ తరవాత ఒక అమ్మాయిని తీసుకొచ్చి వాడి ఎదుట నిలబెట్టి, ''ఈ పిల్ల ఎలా ఉన్నది?'' అని అడిగింది.

''అద్భుతం!'' అన్నాడు సత్యకీర్తి.

వాడు అంత అందమైన స్త్రీని ఎన్నడూ చూడలేదు.

''నాయనా, ఇది నా కూతురు. అందమైనదేగాని పుట్టిననాటి నుంచీ మాట్లాడి ఎరగదు. దీని మూగతనం పోగొట్టేటట్టు స్వార్థదేవతను వరం కోరావంటే, దీన్ని నీకిచ్చి పెళ్ళి చేస్తాను,'' అన్నదామె.

సత్యకీర్తి తన చోటికి తిరిగి వచ్చి, మర్నాడు పూజ చేస్తూ స్వార్థదేవత కనిపించినప్పుడు, ''నేను ఒక అమ్మాయిని పెళ్ళాడదలిచాను. ఆమెకు మాటలు రావాలి,'' అని వరం కోరాడు.

స్వార్థదేవత అందుకు అంగీకరించి మాయమయింది.

సత్యకీర్తి అడవిలో ఉన్న ఇంటికి వెళ్ళేసరికి ఆ స్త్రీ కూతురికి మూగతనం పోయింది.

''నీ కూతురిని నా కిచ్చి చేస్తానన్నావు కదా, చెయ్యి,'' అన్నాడు వాడు.

''సత్యకీర్తీ, నువ్వు ఎంత అమాయకుడివి! ఇంత అందగత్తెను నీకిచ్చి ఎలా వివాహం చేసేది? ఇప్పుడు నా కూతురు మూగది కాదు గనక,ఈ అందాలరాశిని ఏ మహారాజైనా కళ్ళ కద్దుకుని చేసుకుంటాడు,'' అన్నదా స్త్రీ.

''ఇది న్యాయమా?''అన్నాడు సత్యకీర్తి బాధగా.

''న్యాయమే! స్వార్థం అంటే ఏమిటని నిన్న అడిగావు చూడూ; నా కూతురిని నీకియ్యకుండా ఏ మహారాజుకో ఇయ్యటమే స్వార్థం,'' అన్నదా స్త్రీ.

సత్యకీర్తికి స్వార్థం ఏమీ రుచించలేదు. అతను తన చోటికి తిరిగి వచ్చి రెండో దేవతను పూజించసాగాడు. కాని ఆ దేవత ఎన్ని పూజలు చేసినా ఎన్ని ఏళ్ళకూ ప్రత్యక్షం కాలేదు. అతనికి గడ్డాలూ, మీసాలూ పెరిగిపోయాయి. వార్ధక్యం కూడా రానున్నది. ఆ సమయంలో రెండో దేవత ప్రత్యక్షమై, వరం కోరుకోమన్నది.

సత్యకీర్తి ఆమెకు నమస్కరించి, ''నువ్వు ఎవరు, తల్లీ?'' అని అడిగాడు.

''నన్ను నిస్వార్థదేవత అంటారు. నా వరం ద్వారా నీకు శుభం జరగాలంటే నువ్వు కోరే కోరికలో నీ స్వార్థం ఏమీ లేకుండా చూడు,'' అన్నది దేవత.

సత్యకీర్తి ఆమెను మర్నాడు కనపడమని చెప్పి, అడవిలో ఉండే స్త్రీ వద్దకు వెళ్ళాడు. ఇప్పుడామె పండు ముసలిది. ఆమె అతన్ని చూసి ఎంతగానో సంతోషించింది. పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం పెట్టి, విశేషాలు అడిగింది.

అతను ఆమెకు రెండో దేవత ప్రత్యక్షమయిందని చెప్పి, ''నిస్వార్థమంటే ఏమిటి?'' అని అడిగాడు.

ముసలిది నవ్వుకుని, ''నా కూతురిని కళింగదేశపు రాజు పెళ్ళాడాడు. వాళ్ళకు వత్సల అనే కుమార్తె కలిగింది. దానికి ఇప్పుడు పద్దెనిమిదేళ్ళు. చక్కని చుక్క. అయితే దానికి మాటలు రావు. నిస్వార్థదేవతను అడిగి ఆ పిల్లకు మాటలు వచ్చేట్టు వరం కోరు. ఆమెను నీకిచ్చి పెళ్ళిచెయ్యను. అలా చేస్తే అది నిస్వార్థం కాదు,'' అన్నది.

సత్యకీర్తి ఆమెవద్ద సెలవు పుచ్చుకుని తన గతిని గురించి విచారిస్తూ, దారి తప్పి కొంత సేపటికి ఒక ముని ఆశ్రమానికి వచ్చాడు.



ఆ ముని అతని విషయమంతా విని, "బాబూ, నీకన్న ఇరవై ఏళ్ళు ముందు నుంచీ ఇక్కడ దీక్షగా తపస్సు చేస్తున్నాను. కాని నా తపస్సు ఫలించలేదు. అందుకు కారణం ఏమై ఉంటుందో నీ నిస్వార్థదేవతను అడిగి తెలుసుకుని, నాకు చెప్పగలవా?" అన్నాడు.

సత్యకీర్తి సరేనని, తన చోటికి దారి అడిగి తెలుసుకుని తిరిగి వచ్చాడు.

మర్నాడు నిస్వార్థదేవత తిరిగి ప్రత్యక్ష మయింది. సత్యకీర్తి ఆమెను మూగదైన వత్సలకు మాటలు వచ్చేటట్టు చెయ్యమని కోరి, ముని తపస్సు ఫలించకపోవటానికి కారణం ఏమిటని అడిగాడు.

నిస్వార్థదేవత వత్సలకు మాటలు ఎలా వచ్చేదీ చెప్పి, "ఆ ముని చేసిన తపస్సంతా అతని కమండలం మింగేస్తున్నది. ఆ కమండలంలో చేరిన తపశ్శక్తి ఆయనకు తప్ప మరెవరికైనా లభిస్తుంది. దాన్ని ఎవరికైనా ఇచ్చిన తరవాత గాని ఆ ముని తపస్సు ఫలించదు," అని అదృశ్యమయింది.

సత్యకీర్తి ముని వద్దకు వెళ్ళి, దేవత చెప్పిన మాట చెప్పాడు. ఆ ముని తన కమండలాన్ని అతనికే ఇచ్చాడు. దాన్ని చేత పట్టుకోగానే అందులో ఉండిన తపశ్శక్తివల్ల సత్యకీర్తి యువకుడుగా మారాడు. అతను తిన్నగా ముసలిది ఉన్న ఇంటికి వెళ్ళి, "అవ్వా, నీ మనమరాలు తనకు భర్త కాబోయేవాణ్ణి చూడగానే మాట్లాడేస్తుందని దేవత చెప్పింది," అన్నాడు.

"నువ్వా, నాయనా? నిన్ను పోల్చుకోలేదు. నా మనమరాలు ఇంతకు ముందే వచ్చింది. చూపిస్తానుండు," అంటూ ఇంటిలోపలికి వెళ్ళబోయింది.

అంతలోనే ఆమె మనమరాలైన రాజకుమార్తె ఇంటి నుంచి బయటికి వచ్చి, సత్యకీర్తిని చూస్తూనే, "అమ్మమ్మా ఈయనెవరు?" అన్నది.

ఆ పిల్ల నోటమాట రావటం చూసి ముసలిది నిర్ఘాంతపోయి, "నీకు మాట వచ్చిందా, తల్లీ? ఇంతకూ నీ కాబోయే భర్త ఇతనేనా ఏం?" అన్నది.

కాలక్రమాన సత్యకీర్తి కళింగరాజుకు అల్లుడై, అనంతరం ఆ రాజ్యానికి రాజు కూడా అయ్యాడు.





# వెర్రిబాగులవాడు

కొంతకాలంగా, రమణయ్య అనే రైతుకు ఏదీ కలిసిరావడం లేదు. వరిపంట కోతకు వచ్చిన సమయంలో పెద్ద వానపడి అంతా నష్టమయింది. మామిడి తోట పూతకు వచ్చే సరికి, పొగమంచు కమ్మి పూత అంతా మాడి పోయింది. కూతురుకు పెళ్ళిసంబంధం కుదిరినట్లే కుదిరి తప్పిపోయింది.

రమణయ్య కొడుకు గోపాలానికి తాను తెలివైనవాడినని చాలా నమ్మకం. ఇంట్లో ఏ ప్రయత్నమూ ఫలించడం లేదని అతడు, జాతకమార్తాండ శివశర్మను కలుసుకున్నాడు. ఆయన ఏవేవో లెక్కలు కట్టి, "మీ ఇంటిని ఒక క్షుద్రదేవత పట్టి పీడిస్తున్నది. వారం పాటు పూజలు చేశాక, ఒకవెర్రిబాగులవాడికి తృప్తిగా భోజనం పెట్టాలి," అని చెప్పాడు.

"వెర్రిబాగులవాడా? ఇదంతా నాకు చిత్రంగా వుంది!" అన్నాడు గోపాలం.

"చిత్రమేం లేదు. మీ ఇంట్లో అందరూ తెలివైనవాళ్ళు. ఈ క్షుద్రదేవతకు తెలివైన వాళ్ళను పీడించడమంటే మహాయిష్టం. వెర్రిబాగులవాళ్ళకు ఆ క్షుద్రదేవత ఆమడ దూరంలో ఉంటుంది. మీరు చేసినపూజలకు తృప్తురాలైనాక, ఆవిడ మీ ఇల్లు విడిచిపెట్టి, ఇంకొక తెలివైనవాడింటికి పోవాలనుకుం టుంది. అప్పుడు వెర్రిబాగులవాణ్ణి చూపా వంటే వెంటనే మీ ఇల్లు విడిచిపెట్టేస్తుంది," అన్నాడు శివశర్మ.

గోపాలం ఇంటికి వెళ్ళి తల్లిదండ్రులకు ఈ విషయం చెప్పాడు.

"మనకు వెర్రిబాగులవాడెక్కడ దొరుకు తాడురా!" అన్నాడు రమణయ్య.

అప్పుడు గోపాలానికి వీరభద్రం గుర్తు కొచ్చాడు. వీరభద్రం, సూరయ్య కొడుకు. ఆ కుటుంబానికీ రమణయ్య కుటుంబానికీ దూరపుబంధుత్వముంది. వాళ్ళు పొరుగూ రులో వుంటున్నారు. వాళ్ళకూ ఇటీవల ఏవిధంగానూ కలిసిరావడం లేదని తెలిసింది. అందుక్కారణం వీరభద్రమేనని చాలామంది అంటారు. వీరభద్రం తను చాలా తెలివైనవాడి ననుకుంటాడు. కానీ వాడొట్టి వెర్రిబాగుల




వాడు. అలా అంటే మాత్రం వాడొప్పుకోడు. అందువల్ల, అందరూ వాడికి లేని గొప్పతనాన్ని అంటగట్టి మెచ్చుకుంటారు. ఎంతో తెలివైన వాడివని అంటారు. వాడు అపరిమితానందం చెందుతూంటాడు.

గోపాలం, వీరభద్రం గురించి తండ్రికి చెప్పి, ''మీకు వాడు గుర్తుకు రాకపోవడం ఆశ్చర్యంగా వుంది!'' అన్నాడు.

''వాడు వెర్రిబాగులవాడే, కానీ నువ్వు వెర్రిబాగులవాడివి కాబట్టి మా ఇంటికి భోజనానికిరా, అని ఎలా పిలుస్తాంరా?'' అన్నాడు రమణయ్య.

''భలే తెలివి నాన్నా నీది! వాడికి వెర్రిబాగులవాడివని చెబుతామేమిటి? మాటలతో ఇంద్రుడివి, చంద్రుడివి అని ఉబ్బేసి పిలిస్తే నమ్మేస్తాడు. వాడినెలా మచ్చిక చేసుకోవాలో నాకు తెలుసు. వాడి విషయం నాకు విడిచి పెట్టండి,'' అన్నాడు గోపాలం.

రమణయ్య సరేనన్నాడు. గోపాలం పొరుగూరు వెళ్ళి వీరభద్రాన్ని కలుసుకుని, కాసేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పి, ''నీ గొంతు ఇంత తియ్యగావుంది. సంగీత సాధన చేస్తున్నావా?'' అన్నాడు.

''ఆ, చేస్తున్నాను. అంతేకాకుండా కవిత్వంకూడా చెబుతున్నాను,'' అంటూ వీరభద్రం తను రాసిన పద్యాన్ని చదివాడు.

''చాలా గొప్పగా వుంది. ఇన్ని విద్యలు రావడం నీ అదృష్టం. భగవంతుడు నిన్ను మరికాస్త అందంగా పుట్టించి వుంటే ఎంతో బాగుండేది!'' అన్నాడు గోపాలం.

''నేను చాలా అందగాణ్ణని చాలామంది అంటారే!'' అన్నాడు వీరభద్రం ఇబ్బందిగా.

''నేను అబద్ధం చెప్పను; ఉన్నమాటే అంటాను. నీ కవిత్వం బాగుంది. మెచ్చుకున్నాను. నీగొంతు బాగుంది. ఒప్పుకున్నాను. నువ్వు చాలా చాలా తెలివైనవాడివని తెలుసుకున్నాను. అందం కాస్త తక్కువ అయితే ఆ మాటా చెప్పాను. అంతమాత్రాన నువ్వు కురూపివేం కాదు. ఉన్నమాట అంటే ఉలుకులేని తెలివి నీది కాబట్టే, అంతా నీ గురించి గొప్పగా చెప్పుకుంటారు,'' అంటూ మరికాస్త మెచ్చుకున్నాడు గోపాలం.

వీరభద్రం చాలా సంతోషించాడు. తర్వాత గోపాలం, వాడిని ఫలానా రోజున తమ ఇంటికి భోజనానికి రావలసిందిగా ఆహ్వానించాడు. వీరభద్రం సంతోషంగా అంగీకరించాడు.

రమణయ్య ఇంట్లో శివశర్మ యథావిధిగా పూజ జరిపించాడు. అది పూర్తికాగానే, వీరభద్రానికి సుష్టుగా భోజనం పెట్టి పంపేసి, ఆ కుటుంబమంతా ఎంతో సంతోషించారు.

ఆ తర్వాత రమణయ్య దశ తిరిగింది. దూరపు బంధువెవరో పోయి, ఆస్తి కలిసి వచ్చింది. మామిడికాయ దిగుబడి తక్కువొచ్చినా, ధర ఎక్కువపలికింది. రెండోపంటలో వరి రెట్టింపు ప్రతిఫలాన్నిచ్చింది. కూతురుకు చక్కని సంబంధం దొరికి పెళ్ళి అయిపోయింది.

ఒకరోజున దూరపుబంధువు సోమయ్య వాళ్ళింటికివచ్చి, గోపాలం తెలివిని తెగమెచ్చుకుని, "వచ్చే శుక్లపక్షంలో నువ్వు మా ఇంటికి భోజనానికి రావాలి," అన్నాడు.

గోపాలం కొంచెం గాభరాపడి, "నీ ఆహ్వానం చిత్రంగా వుంది. నువ్వుగానీ ఏమైనా క్షుద్ర దేవతా పూజ చేస్తున్నావా?" అని ప్రశ్నించాడు.

"అవును. ఆ విషయం నీకెలా తెలుసు?" అన్నాడు సోమయ్య ఆశ్చర్యంగా.

గోపాలం జరిగినదంతా సోమయ్యకు చెప్పి, "ఆ పూజ తర్వాత ఒక వెర్రిబాగులవాడికి భోజనం పెట్టాలి; నావంటి తెలివైన వాడికి కాదు. మేము సూరయ్య కొడుకు వీరభద్రాన్ని భోజనానికి పిలిచాక, మా దశ తిరిగింది. దాంతో వీరభద్రం వెర్రిబాగులవాడని తిరుగులేని ఋజువు కనిపించింది కూడా! కాబట్టి, నువ్వు వాడినే భోజనానికి పిలుచుకో! నువ్వు చేయబోయే పూజకు వాడే తగినవాడు," అన్నాడు.

"అలా అనుకునే నేను ముందు వాడి దగ్గరకే వెళ్ళాను. వాడు వెంటనే నేను క్షుద్ర దేవతా పూజ చేస్తున్నానని కనిపెట్టడమేకాక – అదంతా మూఢనమ్మకమనీ, ఏ పూజలూ లేకుండానే తమ ఇంటికీ దశ తిరిగిందనీ చెప్పాడు. నిన్ను చిన్నబుచ్చడం ఇష్టం లేకనో ఏమో, నీ సంగతి మాత్రం చెప్పలేదు," అన్నాడు సోమయ్య.

"మరైతే నువ్వు నా దగ్గరకెందుకొచ్చినట్టు? నేను వెర్రిబాగులవాడినని నీ అభిప్రాయమా?" అన్నాడు గోపాలం చిన్నబుచ్చుకుని.

"భలేవాడివిరా! నీ గురించి నాకేమెక్కువ తెలుసునని, నిన్ను వెర్రిబాగులవాడివనుకుంటాను? నిన్ను భోజనానికి పిలవమని, మీ ఊరి జాతకమార్తాండ శివశర్మ చెప్పాడు మరి. కామోసుననుకుని వచ్చాను," అన్నాడు సోమయ్య.

తనను క్షుద్రదేవత పూజకు ఒప్పించిన శివశర్మ, తన గురించి ఏమనుకుంటున్నాడో తెలిశాక, గోపాలం ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు.



# ప్రపంచ సృష్టి!

వేనవేల సంవత్సరాలకు పూర్వం భూమీ లేదు, సూర్యచంద్రులూ లేరు, నక్షత్రాలూ లేవు. ఉన్న దల్లా కింద విశాలసముద్రం, పైన అనంత ఆకాశం!

మగోయాన్ అనే దేవుడు సముద్రాన్ని పాలించేవాడు. ఆకాశానికి అధిపతి కాప్టాన్ అనే దేవుడు. మగోయాన్‌కు లిడాగాట్ అనే సముద్రరూప కుమార్తె, కాప్టాన్‌కు లిహాంజిన్ అనే వాయు స్వరూపుడైన కుమారుడూ ఉండేవారు.

ఆకాశదేవుడు ఒకనాడు సముద్రదేవుడి దగ్గరికివచ్చి, తన కుమారుడు లిహాంజిన్‌కు సముద్ర దేవుడి కుమార్తె లిడాగాట్‌నిచ్చి పెళ్ళి చేయమని కోరాడు. సముద్రదేవుడు అందుకు సంతోషంగా సమ్మతించాడు. సముద్రం పెళ్ళికూతురయింది. వాయువు పెళ్ళికొడుకయ్యాడు. దేవతలందరి దీవెనలతో పెళ్ళి వైభవంగా జరిగింది.

ఆ దంపతులకు ముగ్గురు కుమారులూ, ఒక కుమార్తే కలిగారు. పెద్దకొడుకు లికాలిబుటాన్ శిలాసదృశమైన శరీరంతో దృఢంగా ఉండేవాడు. అమిత ధైర్యశాలి. రెండవవాడు లియాడ్లో స్వర్ణశరీరంతో ఎప్పుడూ ఆనందంగా ఉండేవాడు. మూడవవాడు లిబులాన్ తామ్ర శరీరంతో బలహీనుడుగా, పిరికితనంతో ఉండేవాడు. అమ్మాయి లిసూగా వెండిశరీరంతో చాలా అందంగా ఉండేది. తల్లిదండ్రులకు పిల్లలంటే ఎంతో ప్రేమ. కుటుంబంలోని అందరూ సంతోషంగా తృప్తిగా జీవించసాగారు.



కొంతకాలానికి లిహాంజిన్ మరణిస్తూ, వాయువుమీది తన ఆధిపత్యాన్ని పెద్దకుమారుడు లికాలిబుటాన్‌కు అప్పగించాడు. లిడాగాట్ కూడా కాలధర్మం చెందింది.

పిల్లలు పెరిగి పెద్దవాళ్ళు కాసాగారు. తల్లిదండ్రులు లేకపోయినా, తాతలిద్దరూ వారిపై ఎలాంటి దుష్టశక్తుల ప్రభావమూ పడకుండా కాపాడుకుంటూ వచ్చారు.

కొంతకాలం గడిచింది. తన బలపరాక్రమాలు తలుచుకుని లికాలిబుటాన్ పొంగిపోసాగాడు. క్రమంగా అతనిలో అహంభావం, దురాశ పెరిగాయి. ''ఇంత బలశాలిగా ఉండీ ఒక్క గాలిని మాత్రం శాసించడమా? ఆకాశమంతా నా వశం కావాలి. ఆకాశాధిపతి కాప్టాన్ మీదికి దండెత్తాలి!'' అనుకున్నాడు.

తనవెంట రమ్మని తమ్ములను పిలిచాడు. వాళ్ళకది ఇష్టం లేదు. ''మనకున్న అధికారం మనకున్నది.ఎలాంటి సమస్యలూ లేవు.సుఖంగా ఉన్నాం. అనవసరంగా తాతయ్య మీదికి దండెత్తడం దేనికి?'' అని హితవు పలికారు.

అయినా, అది లికాలిబుటాన్ తలకెక్కలేదు. అమిత కోపం ప్రదర్శించాడు. ఆ కోపం భరించలేక లియాడ్లో అన్నకు తోడుగా వెళ్ళడానికి సమ్మతించాడు. భయస్థుడైన లిబులాన్ కూడా వాళ్ళ వెంట వెళ్ళక తప్పలేదు.

ముగ్గురన్నదమ్ములూ యుద్ధసన్నద్ధులై ఆకాశం మీదికి వెళ్ళారు. అక్కడ ప్రవేశద్వారానికి ఇనుప కవాటాలున్నాయి. ఎంత ప్రయత్నించినా వాటిని ఛేదించలేకపోయారు.

''దీనికి భయపడి మనప్రయత్నం వదులుకుని వెనుదిరగకూడదు. దీన్ని తెరిచే మార్గం నేను చెబుతాను,'' అంటూ లికాలిబుటాన్ కవాటాల మీదికి

బలమైన గాలులను ప్రయోగించాడు. వాటి ధాటికి తలుపులు ముక్కలు చెక్కలయ్యాయి. అన్నదమ్ములు ఆనందంతో లోపలికి జొరబడ్డారు. అయితే, అక్కడ ఆకాశదేవుడు కాప్టాన్ అమితాగ్రహంతో ఎదురయ్యాడు. ఆయన భయంకర రూపాన్ని చూడగానే అన్నదమ్ములు హడలిపోయి వెనుదిరిగి పారిపోబోయారు. ద్వారకవాటాలను బద్దలుచేసిన ముగ్గురిమీద కాప్టాన్ ఆగ్రహోదగ్రుడై మూడు పిడుగులను ప్రయోగించాడు.

మొదటి పిడుగు తామ్రశరీరుడైన లిబులాన్ మీద పడింది. వాడి శరీరం కరిగి ముద్దయింది! రెండవది స్వర్ణశరీరుడైన లియాడ్లో మీద పడడంతో వాడూ కరిగి ముద్దయ్యాడు. మూడవ పిడుగు పెద్దవాడైన లికా లిబుటాన్ మీద పడింది. వాడి శిలాశరీరం ముక్కలు చెక్కలై సముద్రంలో పడిపోయింది. బ్రహ్మాండమైన వాడి శరీరభాగాలు అక్కడక్కడ పైకి లేచాయి. అదే భూభాగమయింది.

అదే సమయంలో వాళ్ళ చెల్లెలు లిసూగా, అన్నలు ఎంతసేపటికీ రాకపోయేసరికి, వాళ్ళను వెతుక్కుంటూ ఆకాశంకేసి పయనమై విరిగిన కావాటాలుగల కాప్టాన్ ద్వారాన్ని సమీపించింది. ఆగ్రహావేశంతో కాప్టాన్ ఆమెపై కూడా ఒక పిడుగును ప్రయోగించాడు. ఆమె వెండిశరీరం వేనవేల ముక్కలై ఆకాశంలోకి చెదిరిపోయింది!

ఆ తరవాత ఆకాశదేవుడు కిందికి దిగివచ్చి, జలసముద్రాన్ని రెండుగా చీల్చి, "దుర్మార్గులైన నీ మనవళ్ళను నా మీదికి ఉసిగొలిపి, ఏమీ ఎరగనట్టు సముద్రంలో దాక్కున్నావా, రా వెలుపలికి!" అంటూ మగోయాన్‌ను నిందించాడు.

సముద్రం నుంచి పైకి వచ్చిన మగోయాన్, "ఎంతోకాలంగా గాఢనిద్రలో మునిగి ఇప్పుడే లేస్తున్నాను. నా మనవలు నీ మనవలు కారా? వారిని నీ మీదికే ఉసిగొలుపుతానా? అపార్థం చేసుకోకు. ఆవేశం అనర్థదాయకం. శాంతించి, ఆలోచించు," అన్నాడు.

కాప్టాన్ కోపం చల్లారింది. ఆవేశంతో మనవళ్ళను చేజేతులా చంపినందుకు వేదన చెందాడు.



ఇరువురూ కొంతసేపు విలపించారు. లిసూగాను తలుచుకుని దుఃఖం ఆపుకోలేకపోయారు. ఇద్దరూ శక్తివంతులేగాని మరణించినవాళ్ళను మళ్ళీ బతికించే శక్తి వారికి లేదు. అయితే, కరిగి ముద్దయిన మనవళ్ళ శరీరాలకు ప్రకాశాన్ని ప్రసాదించారు.

బంగారపు ముద్దయిన లియాడ్లో సూర్యగోళమయ్యాడు. రాగి ముద్దగా మారిన లిబులాన్ చంద్రుడయ్యాడు. వేలాది ముక్కలయిన లిసూగా ఆకాశంలో నక్షత్రాలుగా మిలమిలా మెరవసాగింది.

దుర్మార్గుడైన లికాలిబుటాన్‌కు ప్రకాశం ఇవ్వడానికి దేవతలకు మనసొప్పలేదు. అయితే వాడి భౌతికదేహాన్ని రాబోయే మానవ సంతతికి ఆధారమయ్యేలా చేశారు. కాప్టాన్ ఒక విత్తనాన్ని మగోయాన్‌కు ఇచ్చాడు. ఆయన దానిని మునుపటి లికాలిబుటాన్ శరీరమైన భూమి మీద నాటాడు.

వెంటనే అక్కడొక వింతవెదురుమొక్క మొలిచింది. ఆ మొక్కలోని ఒక కొమ్మలోంచి సికాలాన్ అనే పురుషుడూ, మరొక కొమ్మలో నుంచి సికాచే అనే స్త్రీ పుట్టుకొచ్చారు. వారే మానవజాతికి జననీజనకులయ్యారు. చుట్టూ సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రాలతో భూమిమీద మానవజాతికి అంకురార్పణ జరిగింది!

సేనాధిపతి వీరసింహుడు పన్నుతున్న కుట్ర గురించి శాంతిదేవ మహారాజుకు తెలియవచ్చింది. బిడ్డతోసహా రహస్య సొరంగమార్గం గుండా తప్పించుకుని వెళ్ళమని రాజు మహారాణిని ఆదేశించాడు. వెలుపలి నుంచి రాజభవనం మీదికి దాడి ఆరంభమయింది...

2

# ఆర్య

## అజ్ఞాత యువరాజు విచిత్ర సాహసగాథ

చిత్రాలు: గాంధి అయ్య









వాళ్ళల్లో కొందరిని హతమార్చాడు.

భవనం వెలుపల యువరాజు జన్మదినవేడుకలు బాణాసంచాల ప్రేలుళ్ళతో కోలాహలంగా జరుగుతున్నాయి. భవనం లోపల జరుగుతూన్నవేవీ అక్కడి ప్రజాసందోహానికి తెలియదు.





రాజు వాణ్ణి తప్పించుకుని...


మెట్లపై ఉన్న మనుషులను ఎదుర్కొన్నాడు.


రాజును పట్టుకోవాలన్న
వాళ్ళ పథకాన్ని రాజు
సాగనివ్వలేదు.


అంతలో అక్కడికి వచ్చి రాజుపై తలపడిన
వీరసింహుడి చెవి, రాజు కత్తివేటుకు తెగి
దూరంగా పడింది.


రాజు భవనం ఉపరితలం
మీదికి చేరుకున్నాడు.


ఒక సైనికుడు రాజు పిట్టగోడను
సమీపించకుండా అడ్డుపడ్డాడు.




రాజు వాణ్ణి ఒక్క దెబ్బతో
పైనుంచి కిందికి పడదోశాడు.


ఉపరితలం పిట్టగోడమీదికి
ఎగ్రబాకడానికి కొందరు సైని
కులు ప్రయత్నిస్తూండడం
రాజు చూశాడు.
ఇంకావుంది

# వినోద సమయం

ఏమిటి అలా చూస్తున్నారు? రెండు చిత్రాల మధ్య
ఎనిమిది తేడాలు ఉన్నాయి.
కనుగొనండి మరి!

1





2

వేయండి సరైన
రంగులు!
తీర్చిదిద్దండి
ఆకర్షణీయంగా!



నాలుగు మొసళ్ళు
ఉన్నాయి కదా! వీటిలో
పొడవైనదేదో చెప్పండి
చూద్దాం!

3

(సమాధానాలు 66 వ పేజీలో)





వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ


Soura


Soura



ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు అక్టోబర్ 2003 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

కె. నిజాముద్దీన్
2-1-549/2, శంకరమఠం రోడ్
న్యూ నల్లకుంట పోస్ట్
హైదరాబాద్ - 500 044. (ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో: శ్రమలోనే ఉంది సాధన!
రెండవ ఫోటో: సాధించుటకు ఆలోచన!

**వినోదసమయం సమాధానాలు (పేజీలు 64-65)**

1. 1. నక్కతోక దగ్గరి గులకరాళ్ళు 2. జేబు 3. నక్కతోక 4. మిడత చొక్కా 5. కుడివైపు ఆకులు 6. చెట్టు బోదెలోని వలయాలు 7. నక్కకూ మిడతకూ మధ్య వున్న గులకరాళ్ళు 8. ఎడమవైపు ఆకులు.

3. మొత్తం 5 మొసళ్ళున్నాయి. డి. మొసలి పొడవైనది.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

